# వెంకన్న'స్ కోల్డ్

బొమ్మలకథ:

10
























(ఇంకా ఉంది)



ANNAPURNA
మహీజా ఫిలిమ్స్ సమర్పించు - దేవర్ ఫిలిమ్స్
ప్రాణస్నేహితుడు
ఈస్ట్మన్ కలర్
దర్శకత్వం. ఎమ్. ఏ. తిరుముగం సంగీతం. కె. వి. మహదేవన్. పామర్తి
అన్నపూర్ణ రిలీజ్



ఆంధ్రప్రదేశ్ అకాడమివారి అవార్డుపొందిన శ్రీమతి వాశిరెడ్డి సీతాదేవిగారి
నవల 'సమత' ఆధారంగా నిర్మింపబడిన సరికొత్త చిత్రం!

నాగభూషణం సమర్పించు SASI THEATRES శశి థియేటర్స్ (ప్రై) లిమిటెడ్

# ప్రజానాయకుడు

స్క్రీన్‌ప్లే - దర్శకత్వం: వి. మధుసూదనరావు

సంగీతం: కె.వి. మహదేవన్

నిర్మాత: సి.హెచ్. రాఘవరావు

DEVI

నైజాం డిస్ట్రిబ్యూటర్స్:
అనిత్ ప్రభాస్ ఎంటర్‌ప్రైజెస్
నవయుగ

గురించి రాస్తూ— శ్రీయుతులు బలివాడ కాంతా రావు అన్నారు. ఒక వ్యక్తిని శ్రీయుతులు అని సంబోధించరు.

అలాగే కె. జయంతి (లచ్చిపేట)గారు రాస్తూ ఒకానొక కథ రాసిన రచయిత్రిని కవయిత్రిగారు అని సంబోధించారు. కవితలు రాసేవారుమాత్రమే కవయిత్రులు, కవులు. మిగతా సాహిత్య ప్రక్రియలు రాసేవారిని రచయితలు రచయిత్రులు అంటారు.

ఉత్తరాలు రాసేవారు రకరకాలుగా రాస్తుంటారు. కొందరు వాక్యాలు సరిగా రాయరు. కొందరి శైలి బాగుండదు. కొందరు అనవసర విషయాలు రాస్తూ ఉంటారు. ఎలా రాసినా భావం ఉండాలి ఉత్తరంలో! ఉత్తరంలో పస ఉండాలి. ఆకథ బాగుంది. ఆ రచయిత్రికి అభినందనాలు. ఆ రచన పత్రికకే హైలైట్! లాంటి ఉత్తరాలు ప్రచురించడం దండగ!

ఉత్తరాలు రాయడం ఒక కళ! కొందరు చక్కటి టెక్నిక్‌తో రాస్తుంటారు. అలాంటి ఉత్తరాల్ని ప్రచురించాలి. నలుగుర్ని ఆకర్షిస్తాయి కూడా ఏమయినా ఉత్తరాలు కొంచెం చూసివేస్తుండాలి.

—వి. మధుసూదనరావు, (హైదరాబాదు)

* * *

'రాగధార'లో మాధవరావుని అతని వదిన బంగారు మాత్రము ఎట్టి పరిస్థితులలోను అమ్మనని తనకి మాటిమ్మంటుంది. అప్పుడు మాధవరావు 'అలాగే వదినా! ఒకవేళ అమ్మవలసివచ్చినా నీకు చెప్పికాని.... నీ అనుమతి తీసికొనికాని అవనిచెయ్యను. అన్నా'నని రాధతో అంటాడు. ఈమాటలకర్థంలేదు.

'అలాగే వదినా! ఒకవేళ అమ్మవలసి వచ్చినా నీకు చెప్పకుండాగాని...నీ అనుమతి తీసుకోకుండాగాని అవని చెయ్యను అనాలి' ఈ సవరణను రచయిత్రిగారు అంగీకరించ కోర్తాను.

—ఉపద్రష్ట కేశవస్వామి, (అమలాపురం)

### కథలు

'కుమారీ రచయిత్రి శ్రీమతి' నవ్వుతెప్పిస్తుంది

# ఉత్తరాలు

ఇంకా మంచి కథలు ప్రచురిస్తారని ఆశిస్తూ.

—అయినంపూడి సుజాతా శ్రీనివాసరావు, (తెనాలి)

* *

'కుమారీ రచయిత్రి శ్రీమతి' కథ [illegible] అందులో లేఖ యొక్క కవితాభిలాష చాల సరదాగా ఉంది.

—మల్లీశ్వరి, జయశ్రీ, (సాలూరు)

### పానీయాలు

శ్రీ మూర్తి, శ్రీవిజయ సౌజన్యగారి ఔషధముల వంటి పానీయాలు బాగున్నాయి. ఇంకా ఇలాంటివి ప్రచురించండి. ప్రతివారం ఏ ఒక్క వంటకాన్నయినా ప్రచురించి అతివల అభిమానాన్ని చూరగొనగలరని భావిస్తున్నాను

కె.కమలాశాస్త్రి, (పెద్దపల్లి)

### వ్యాసాలు

ఇప్పటి మన ఆంధ్రరాజధాని హైదరాబాద్. ఆ పేరు ఎవరి వల్లనో సంక్రమించింది [అట]. అయితే ఇది అప్పటి నగరం కాదు.ఎన్నో మార్పులు, కూర్పులు, ర్పులువచ్చి భాగ్యనగరముయింది. ఇప్పుడున్న [పాత] పేరు తీసి కొత్తపేరు 'భాగ్యనగరం అనిగాని, లేక భాగ్యనగర్ అనిగాని [మార్చాలని, దీనికి సంబంధించిన అధికారులను కోరుతున్నాను.

ఎస్. జయంత్, (సికిందరాబాద్)

### సినిమా

16—6—72 సంచిక ఉత్తరాల శీర్షికలో మిత్రులు పి.బి.సుందరరెడ్డి, లలిత (విజయవాడ) గార్లు కృష్ణ తెలుగు చలనచిత్ర పరిశ్రమకే వెన్నెముక వంటివాడు అని వ్రాస్తే గుంటూరు సోదరీమణులకు బాధ అనిపించిందని 30—6—72 సంచిక ద్వారా తెలిసింది. ఇందులో బాధఅనిపించవలసింది ఏముందో?

—ఎం. ఎస్. భూషణ్, ([illegible])



ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)
శుక్రవారం: 4—8—72
శ్రీపరీధావినామ సం॥ ఆషాఢ మాస॥ [illegible]
సంపుటము: 65 సంచిక: 5[illegible]
స్థాపితము.
1908
సంపాదకుడు.
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
1, తంబుచెట్టి వీథి, మద్రాసు - 1
విడి ప్రతి వెల 50 పైసలు

## విషయానుక్రమణిక


భారత్-పాక్ సమస్యలన్నిటికీ పరిష్కారం కావాలి
కాశ్మీర్‌లో అడుగు పెట్టవద్దు. అది నాది
ముట్టమొదట మా ఖైదీలని విడుదల చెయ్యండి
యుద్ధ ఖైదీలని శిక్షిస్తాను
శాంతి అన్నది చాలా దూరంలో ఉన్నది


జయప్రకాష్ నారాయణ్
పార్టీ లేని ప్రజా స్వామ్యం


శాంతి భద్రతలు
నక్సలైట్లు


మనవి బయటికి వెళ్లు
నేను లోపలికి రావచ్చా?

## కొత్త శీర్షిక ప్రారంభం!

# అనామధేయుడి ఆత్మకథ

## — ఆర్వీయ —

### సీరియల్ హాస్యరచన

'అనాథ ప్రేత సంస్కారే కోటిపుణ్యం లభేత్' అన్నట్టు అనామధేయుడి కథ విన్నవారికి అనంతకోటి పుణ్యాలు లభిస్తాయని, రాసిన వాడికి అఖండ స్వర్గప్రాప్తి కలుగుతుందనీ, ఒకర్ని తరింపచేసి తాను తరించడమే జన్మసార్థక్య ఫలమనీ ఈ నా ఆత్మకథను తెలియజేస్తున్నాను.

అదీకాక, శ్రీ కృష్ణదేవరాయలు పెద్దన్నతో అన్నాడో—లేక పెద్దన్నతో అన్నట్టు రాశాడో గాని—

'సప్త సంతానములలో ప్రశస్తి గాంచి
ఖిలముగాకుండునది ధాత్రిగృతియొకాన...'

—అన్న విధంగా ఒక కృతిరాసి లోకానికి సమర్పించదలచుకున్నాను. మొదట ఏదైనా మంచి కావ్యం రాద్దామనుకున్నాను. కాని, తర్వాత ఆలోచించేను. సాధారణంగా ఈ రోజుల్లో ఒక పద్యమే జీర్ణం కాదు గదా— కావ్యమంతా జీర్ణం అవుతుందా? ఈ అజీర్ణం గనుక వ్యాపిస్తే లోకక్షయం అవుతుందేమో! అంచేత కావ్యం పనికిరాదని నిశ్చయించుకున్నాను. ఒక నవల రాద్దామా అనిపించింది. ఇప్పటికే నవలలు ఆంధ్రదేశంలో కోకొల్లలుగా బయల్దేరాయి. ఓనమాలు వొచ్చిన ప్రతివాడూ ఒక నవలా రచయిత. అసలు నవలలు చదివే వారికన్నా రాసేవారే ఎక్కువ అనుకుంటాను. ఆ కోవలో చేరడానికి మనస్కరించలేదు. పోనీ చిన్న చిన్న కథలు రాస్తేనో అనిపించింది. దాని తీరూ అలాగే ఏడ్చింది. కథకేమిటి కావాలయ్యా? క్లయిమాక్స్! అదుంటే చాలట; మధ్య కథ ఎలాగేడ్చినా ఫర్వాలేదుట! అదీకాక, కథ అంటే డిటెక్టివ్ కథేనని కొందరు, మిగిలినవన్నీ ప్రేమగాథలే అని మరికొందరు. ఏమో! ఈ కథలు రాయడం మనకు చేతకాదు.

ఇంతకీ ముఖ్యమైన కారణం ఏమిటంటే— ఆంధ్రదేశంలో ఆత్మకథలు చాలా తక్కువ. ఆంధ్రభాషలో 'ఆత్మకథా వాఙ్మయం' అధోగతిలో వుండడం అప్రతిష్ఠాకరం. అంచేత ఒక ఆత్మకథ రాయదల్చుకున్నాను. ఆ కృతి వారిమీద — వీరిమీద రాయడం కన్నా ఆత్మపరంగా రాస్తే, ఆత్మశాంతి కలుగుతుందనీ, లోకోపకారం కూడా జరుగుతుందనీ దీన్ని రాయడం జరిగింది.

తమ తమ జీవితగాథలు — మహాత్మాగాంధీ దగ్గరనుంచి కాండూరి లక్షింపతి వరకూ రాసుకున్నారు. లేకపోతే రాయించుకున్నారు. స్వయంగా రాసుకున్నవారిలో గాంధీజీ, నెహ్రూ, వీరేశలింగంగారు మొదలైనవారున్నారు. రాయించుకున్నవారి సంఖ్య ఇదమిద్ధమని తెలియదు. రాయదలచుకున్నవారు లక్షోపలక్షలని ధ్రువపడని వార్త.

మరోటేమిటంటే — ఏ జీవిత చరిత్ర తిరగేయండి — వాళ్ళంతా అతిరథులూ, మహారథులూ! ఒక సుప్రసిద్ధ రాజకీయవేత్తో, నిరర్గళ వాగ్ఝరీపూరితుడైన వక్తో, కవిసార్వభౌమ శిరోమకుటప్రాయుడో, అనర్గళ గ్రంథ సంధాన విధాన కుశలుడో, సునిశిత విమర్శకాగ్రేసర చక్రవర్తో, నాటక కళాధురంధరుడైన నటక ఘటికుడో — మొత్తానికి వాడొక దేవాంతకుడు అయివుంటాడు. కాని, అనామధేయుడి మొర విని నాథుడు లేడు, కనుక ఒక అనామధేయుడి చరిత్ర రాయాలని సంకల్పించుకున్నాను. ప్రముఖుల్ని కీర్తించే రోజులు పోయాయి. సామాన్య మానవుని కీర్తించే రోజులొచ్చేయి. అయినప్పటికీ ప్రముఖుల జీవితాలు తప్ప ప్రజాసామాన్యుని జీవితాన్ని లోకపు తెర మీదికి యింకా ఎక్కించకపోవడం శోచనీయం. అంచేత ఆ పనికి నేనే పూనుకున్నాను. అనామధేయుల్లోకెల్లా అనామధేయుడనైన నా చరిత్రనే ఎన్నుకున్నాను... నా జీవితచరిత్ర ఎవరైనా రాస్తారేమో అని ఇంతవరకూ యెదురుచూశాను. కాని అదృష్టవశాత్తూ ఎవరూ ముందుకి రాలేదు. అంచేత ఆ భాగ్యం నాకే దక్కింది. ఏదైనా మంచికార్యం చెయ్యాలంటే యెవరూ ముందుకి రారుకదండీ! అదీ ఒకందుకు మంచిదే. స్వయంగా చేసుకున్న పనివల్ల ఆనందం ఇంకొకరు చేస్తే రాదు. కనుక, నేనే ఈ పనికి పూనుకోవాల్సి వచ్చింది. ఇందుకు పాఠకులు నన్ను క్షమింప ప్రార్థితులు.

'అనామధే —

### వంశ వర్ణన

'ఆంధ్రత్వం అనేకత్వం
ఆంధత్వం బహునాయకం
ఆంధ్రత్వం అంధప్రాయం

ఆంధ్రత్వం అతిథి లక్షణం'

—అని అందరిచేత కొనియాడబడుతూ వున్న ఆంధ్రదేశం నా జన్మస్థానం. ఆంధ్రదేశం అనేక మహనీయులకు ఆటపట్టు. ఈ ఆంధ్రదేశంలోనే పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు... ఈ ఆంధ్రదేశంలోనే పానుగంటి జంఘాల శాస్త్రిగారు, చిలకమర్తి గణపతిగారు, గురజాడ గిరీశంగారు, మొక్కపాటి పార్వతీశంగారు, శ్రీరంగం కోనేటిరావుగారు, కొడవటిగంటి సీతప్పగారు, ముళ్ళపూడి అప్పారావుగారు మొదలైన ఎందరో మహానుభావులు జన్మించేరు. పురుషులే కాదు, స్త్రీ రత్నాలు కూడా వున్నారు. వారిలో విన్నదగిన మహిళలు: మునిమాణిక్యం కాంతమ్మగారు, నండూరి వెంకీ, భానుమతి అత్తగారూనూ!

ఇట్టి ఆంధ్రదేశంలో కాకినాడపట్టణం సుప్రసిద్ధం. ఆ పట్నానికి చేరువలోనే వున్న కోనంగి అగ్రహారం మా కాపుర స్థలం. ఈ కోనంగి అగ్రహారం రామాయణ కాలంలో కూడా వుండేదనిన్నీ, ఇక్కడే హనుమంతుడు, జాంబవంతుడు మున్నగు వానర శిష్యులు జన్మించారనిన్నీ, ఈ కోనంగి పూర్వం కిష్కింధ అని పిలవబడేదనిన్నీ, క్రమేపీ పామరజనుల నోటబడి కిష్కింధ—కోనంగి అయిందనిన్నీ స్థల పురాణజ్ఞులు ఇప్పటికీ చెబుతారు.

ఇంక, మా అగ్రహారాన్ని వర్ణించాలంటే అథవా అరడజను కావ్యాలూ, అన్ని నాటకాలూ రాసి, కొన్ని సినిమాలు తీసి, మరికొన్ని బుర్రకథలు చెప్పించినా పూర్తి కాదేమో! ఏమిటయ్యా. ఇంత కథ చెప్పేవు జనాభా యెంత?—అని అడగ్గలరు. జనాభా అంతా కలిపి పెరసి పాతికమందే! తగువులు మాత్రం సవాలక్ష! కచ్చితంగా టూకీగా చెప్పేస్తాను. ఆంధ్రదేశంలో ఒక శోభన్నాద్రీ, ఒక కరటకుడూ, ఒక దమనకుడూ మాత్రమే వున్నారు. మా వూళ్లో మేం తప్ప అంతా అదే వరస! కాని, సౌజన్యారావు ఒక్కడైనా—కంచుకాగడా వేసినా, అథవా సెర్చ్‌లైట్ వేసినా—మచ్చుకైనా మందుకేనా దొరకడంటే నమ్మండి. ఈ కోనంగి పుర్యాగహారం గురించి స్థలపురాణంలో ఇలా వుంది: దీనినిబట్టి మా అగ్రహారం చరిత్ర మీకు సమగ్రంగా, కూలంకషంగా అవగాహన అవుతుంది



'వంగిరి వేషంబు నక్క వినయములు
నాలిముచ్చుతనంబు నవ్వులాలు
బిగురులు బిగురుట బీరంబు సూపుట
బిర్రబిగుటలు పిరికితనము
వికౄలు నీల్గుట నెఱజాణ తనములు
విస్ఫ్రుహ చెందుట నివ్వెఱలును
బుర్ర తిరుగుటను విర్రవీగుటలును
పిలవని పేరంట పెత్తనములు.

'ప్రబిమలాడుట, యేడ్చుట, బాధపడుట
పాదములు పట్టుకొనుటయు, ప్రాకులాట
సమయమునుబట్టి నడచు నైజంబులిటను
మేటి కోణంగి పురవాటి సాటిలేదు!'

—ఇలా రాస్తూ పోతే, ఆ స్థలపురాణ మంతా ఇక్కడ రాయాల్సివస్తుంది. కావలసిన వారు నాకు తెలియచేస్తే, ఆ స్థల పురాణాన్ని నేను పంపిస్తాను.

ఈ కోణంగి అగ్రహారంలో మా వంశస్థులు అతి ప్రాచీనులు. అసలు సృష్టి పుట్టకముందే వీళ్ళు పుట్టేరట. అందులో మా తాతగారు—కాండూరి రామనాథాయ గారు నిత్యాగ్నిహోత్రుడు. నిరంతరం చుట్టకాలుస్తూ వుండడంచేత ఇతనిని నిత్యాగ్నిహోత్రుడు అనడం సార్థకమైంది. ఇతను చాలా ఉద్దండపిండంట. అయితే, ఇతని అసలుపేరు ఎవరికీ తెలియదు. కాని 'రామనాథాయ' అన్నపేరు ఆ వూరివాళ్ళు ఏకగ్రీవంగా తగిలించారుట. ఎందుకంటే ఇతను మాట్లాడేటప్పుడు ఊతపదం 'వల్లకాట్లో రామనాథాయ' అని తరమా ఉపయోగిస్తూ ఉండేవాడుట.

# అనామధేయుడి ...

ఉదాహరణకి:

'వెధవ! పుచ్చిపప్పు నా మొహాన్ని పారేశాడు'

'ఎవరండీ?'

'ఎవడో. వల్లకాట్లో రామనాథాయ—పుల్లయ్యశెట్టి'

'ఏమండీ, మొన్న మీ యింటికి వచ్చిన చుట్టం ఎవరండీ?'

'వాడా? వల్లకాట్లో రామనాథాయ. మా మేనత్త కొడుకే!'

—ఇలా ఈ పదాన్ని తరచుగా వుపయోగిస్తూ, ఆఖరికి ఆ పదాన్ని తన నామాంకితంగా కైవసం చేసుకున్నాడు. ఇతని గురించి అనేక కథలు ప్రచారంలో వున్నాయి. ఇతను అతి అమాయకుడూ! మహాగడసరి. ఈ రెండూ ఎలా అతుకుతాయి అంటారేమో! ఈ కింది గాథను చిత్తగించండి.

ఒకనాడు ఈ రామనాథాయగారు శిస్తు వసూలు చెయ్యడానికి కోణంగికి నాలుగు క్రోసుల దూరంలో వున్న, రేలంగికి వెళ్ళేరు. అతికష్టంమీద ఆ రైతులదగ్గర నూరు రూపాయలు శిస్తు వసూలుచేసి, పొడుగ్గా వున్న చిక్కంలో ఆ నూరు ఇచ్చు రూపాయలూ (ఆ కాలంలో పల్లెటూరి వాళ్ళు నోట్లని నమ్మేవారు కాదు!) వరుసగా చక్కగా పేర్చి, ఆ చిక్కాన్ని బెల్టులాగా మొలకి చుట్టుకొని, దానిమీద బట్టలు వేసుకుని బయల్దేరాడట.

డబ్బు మొలలో దాచుకొని, ఒక చేతిలో బిచాణా, మరొకచేతిలో సంచీ, నోట్లో చుట్టా పెట్టుకొని, ఒక్కడే ఏకాయెకి వస్తూండగా—మిట్ట మధ్యాహ్నం అయింది. ఒక్కపిట్టా కనబడదు. ఇంతలో నలుగురు ముష్కరులు ఎదురుపడ్డారు. చేతిలో వున్న మూటా ముల్లె తీసుకొని, మారుమాటాడకుండా ఆ దొంగలు వాళ్ళ దారిని వాళ్ళు వెళ్ళిపోతున్నారు. 'అన్నన్నా!' అనుకున్నారు మా తాతగారు. వెనకాతల మరో పది మందిగాని వుంటే, ఆ దొంగల్ని సున్నం లోకి ఎముక మిగలకుండా తుక్కుతుక్కుగా కొట్టిపారేసి వుందురు. ఒక్కరే అయిపోవడం చేత విడిచిపెట్టేశారు. తర్వాత నవ్వుకున్నారు. అసలు 'ఖంగులు' మొలలో భద్రంగా వున్నాయి. దొంగలు మంచి టోకరా తిన్నారు—అనుకున్నారు.

అనుకుంటే లాభమేమిటి? ఏలాంటి టోకరా వాళ్ళు తిన్నారో వాళ్ళకి తెలియకపోతే, ఏమిటి లాభం? చూశారా ఎంత గడుసతనమో! వాళ్ళ పొరబాటు వాళ్ళకి తెలియజేసి వాళ్ళు ఏడుపుమొహం పెడితే తను చూడాలి..

దొంగల్ని రెండు ఫర్లాంగులు వెళ్ళనిచ్చేరు. అప్పుడు 'ఒరేయ్ దొంగవాళ్ళూ!!' అని పెద్ద కేకపెట్టారు. వాళ్ళ కేకలు మన కేకల్లాగ కావు కదండీ? ఇప్పుడు యింట్లో ఈ గదిలో వున్నవాడి మాట ఆ గదిలో వినబడదు. అంతా సుకుమారం. ఆ కాలంలో 'శ్రీమద్రమారమణ గోవిందా' అంటే అర్థమం ఆరు ఫర్లాంగులైనా వినబడాలి. ఆ రోజులు మరిరావు. ఈ రోజులు మరి పోవు. ఆ కేకలు విని

హరిరామ్









దొంగలు దెబ్బతిన్న కోడెల్లా నిలబడ్డారు: "ఒరేయ్ దొంగవెధవల్లారా! నా మూటా ముల్లే తీసుకుపోయేరు. అందులో ఏముంది, లబోధశంఖం. అసలు ఖంగులు నా మొల్లో వున్నాయ్రా!' అన్నారట. దాంతో దొంగలు ఉరకలేసుకుంటూ, పరుగులు పెట్టుకుంటూ వచ్చి. మొల్లో వున్న, మూటకూడా తస్కరించి, కొన్ని చపేటాల్ని, బహూకరించి చెరి పోయారు. మొత్తానికి మహాఘటికుడు లెండి మా తాతగారు!

మా తండ్రిగారైన విస్సన్నగారు — తండ్రిని మించిన తనయుడు. ఈయనా

## అనామధేయుండి ...

నిత్యాగ్నిహోత్రుడే. ఈయన బీడీలను ఆహుతి చేస్తుండేవారు. ఈయనకి విద్య అబ్బలేదు. ఈయన్ని చూసి. విద్య జడుసు కొని, ఆమడ దూరంలో ఉండేదట. విద్య లేకపోతే లేదుకాని, బహు పెద్దమనిషి. చాలా దొడ్డమనిషి. అప్పు ఇవ్వడమేగాని వసూలు చేసే పద్ధతి ఈయన దగ్గర లేదు. అంతో ఇంతో సంపన్నుడు...ఊళ్లో వాళ్లు ఈయన్ని బ్రహ్మరథం పట్టేవారు. ఈయన ఎంత చెపితే ఆవూరు అంత! అందుకే పుట్టింది, 'విస్సన్న చెప్పింది వేదం' అని ఆ కాలంలో గనుక అలా వుండిపోయాడు కాని, ఈ కాలంలో అయితే అధమం ఆ వూరి పంచాయితీ బోర్డుకి ప్రెసిడెంట్ అయినా అయి వుండును. ఆ రోజుల్లో ఆ వూళ్లో పంచాయితీబోర్డు లేదు; ఈ రోజుల్లో ఆ వూళ్లో అలాంటి మనిషి లేడు. అతను అందర్నీ నమ్మేవాడు. మహాత్మా గాంధీ ఏమన్నాడు? శత్రువులనైనా నమ్మ మన్నాడు. న్యాయశాస్త్రం ఏమంటూంది? దొంగ అని తేలినంతవరకూ దొరగానే భావించమంటుంది. ఈ విస్సన్నగారు ఆ ప్రకారంగా అందర్నీ నమ్మేవారు కాని, ఒక సంఘటనతో మానవత్వం మీద ఆయనకి జీవితాంతం విశ్వాసం నశించింది.

ఆ ఉదంతం ఏమిటంటే—ఆయన చేతికి మురుగులు ఉండేవి ఆ కాలపు అప్టుడేట్ ఫేషన్ అది. ఇప్పుడు రిస్టు వాచీ పెట్టుకున్నవాడికంటే, అప్పుడు మురుగులు పెట్టుకొన్నవాడికే ఎక్కువ గౌరవం. కోణంగి అగ్రహారానికి రెండు కోసుల దూరంలో వేమవరం వుంది. ప్రతివారం ఈ వేమవరంలో గొప్ప సంత కూడుతుంది. ఆ సంతకు వెళ్లి, కూరా నారా తెచ్చుకోవడం కోణంగి గ్రామస్థులకి పరిపాటి. ఆ సంతనాడు నలుగురూ బయలుదేరి వెళ్ళి, సాయంకాలానికి ఇళ్ళు చేరుకుంటారు. చీకటిపడకుండా చేరుకో వాలి. ఎందుకంటే ఆ దార్లో—కోణంగి గ్రామానికి మైలున్నర దూరంలో ఒక చిట్టడవి, ఒక చిన్న మెట్ట వున్నాయి. అక్కడ విలుగుగొడ్లు తిరుగుతూ వుంటాయి.

ఆ రోజు విస్సన్నగారు మరి కొంత మంది గ్రామస్థులు కలిసి వేమవరం సంతకు వెళ్ళారు. తిరిగి వచ్చేటప్పటికి కను చీకటి పడింది. ఆ చీకట్లో అందరూ గబగబా నడిచి పోతున్నారు. విస్సన్నగారు వెనకయిపోయారు. సరిగ్గా ఆ చిట్టడవి లోకి చేరుకున్నారు. మెట్టపక్కనే వుంది. ఇతనికి భయమంటే ఏమిటో ఎంత మాత్రం తెలియదు. అజాతశత్రుడు. అంచేత శత్రుభయంలేదు. నిదానంగా బీడీ తగిలించుకొని, పెళ్లినడకలు నడుస్తూ, చీకటిని పౌర్ణమినాటి వెన్నెలగా భావిస్తూ వస్తున్నారు.

చీకట్లో బంగారం మురుగులు మిల మిల మెరుస్తున్నాయి. ఇంతలో ఇద్దరు పెద్దమనుష్యులు ఎదురుపడ్డారు. 'బాబూ, అగ్గిపెట్టె ఉందా?' అన్నాడొకడు. విస్సన్న అగ్గిపెట్టె యిచ్చేరు. ఏన్నిపుల్లలు వెలిగించినా, ఆ గాలిలో ఆరిపోవడమే. 'ఆ మెట్ట పక్కకి వెళ్తే అగ్గిపుల్ల వెలుగుతుంది. ఇక్కడ గాలి!' అన్నాడింకొకడు. సరే, గాలికి చాటుగా అగ్గిపుల్ల వెలిగించడానికి ఆ ఇద్దరూ మెట్టపక్కకి దారి తీశారు. అగ్గిపెట్టెకోసం విస్సన్నగారు వాళ్ల వెంట పడ్డారు. వాళ్లు అగ్గిపెట్టె వెలిగించి బీడీలు కాల్చుకొని, ఈయనకి కూడా ఒక బీడీ ఇచ్చేరు. ఈయన 'నేను కాలుస్తున్నాగా, వద్దు!' అన్నా వినలేదు. 'బాబూ, ఇది కరీంబీడీ చేసా ఘాటైనది' అని 'ఫో ఏస్' చేశారు. అంచేత నోట్లోవున్న 'మూడు గుర్రాలబీడీ' అవతల పారేసి 'కరీంబీడీ' వెలిగించేరు. 'కూర్చోండి బాబూ' అన్నారు ఆ పెద్దలు. వేళ మించిపోతూంది. కాని, ఇవతల పెద్దమనుషులు బీడీముక్క ఇచ్చి 'కూర్చోండి బాబూ' అని ఆహ్వానిస్తుంటే—మొరాయించి లేచిపోవడం మర్యాదా లక్షణం కాదని అక్కడే చతికిలపడ్డారు, పసరు పూసుకొన్న పాదాలతో హిమవత్పర్వతం మీద చతికిలపడ్డ ప్రవరాఖ్యుడిలాగ! ప్రవరు డిని సిద్ధుడిచ్చిన పాదలేపనం బంధించింది, మన విస్సన్నగారిని బీడీ ముక్క బంధించింది. ఏదో లోకాభిరామాయణం మాట్లాడుకుంటున్నారు. అది ఎంతకీ తెమలదు. అంతకీ తెమలదు,

ఇంతట్లో బాగా చీకటి పడింది. విస్సన్న గారితో సంతకి వెళ్లిన వారందరూ తిరిగి వచ్చారు. విస్సన్న మాత్రం రాలేదు. ఊళ్లో హాహాకారాలు చెలరేగాయి. కేవలం ఏ హాకారాల్తో పనులు జరగవని వెదకడానికి వెలుగుడూ బయలుదేరారు,

'విస్సన్న మావా!' 'విస్సన్న బావా!' —'విస్సన్నోయ్!'— 'ఓరి విస్సన్నా!' ఇలాగ దారిపొడుగునా కేకలు వేస్తూ, ఆ నలుగురూ బయలుదేరారు. మెట్టు సమీపించేసరికి వారికేకలు విస్సన్నకి వినిపించేయి జవాబిద్దామని నోటిదాకా వచ్చింది. బెదురు గుండావున్న ఆ యిద్దరు పెద్దమనుష్యులు ఊరుకోమని సంజ్ఞ చేశారు. అలాంటి పెద్దమనుష్యుల మాట కొట్టేయలేక (ఈ కాలంలోనా? పెద్దాలేదు. చిన్నాలేదు. పిదపకాలం పిదప బుద్ధులూ...) ఊరు కున్నారు. ఇంకా కేకలు దగ్గరగా—గట్టిగా వినబడుతున్నాయి. రానురాను మరీదగ్గరగా—మరీ గట్టిగా వినబడుతున్నాయి. ఎంత దగ్గరగా—ఎంత గట్టిగా వినబడుతున్నాయి.

# ఏషణాలంటే___



## బులుసు వేంకటరమణయ్య - ధర్మపథం

బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం, వానప్రస్థం, సన్యాసం— అనే నాలుగు ఆశ్రమాలలోనూ గృహస్థాశ్రమమే ఉత్తమమైనదని అందరూ అంగీకరిస్తారు. బ్రహ్మచారులు, సన్యాసులు గృహస్థులపైనే ఆధారపడి ఉన్నారు. గృహస్థాశ్రమం యొక్క పరిణామావస్థయే వానప్రస్థం. అది వృద్ధులైన దంపతులు సంసారాన్ని విడిచి వనవాసం చెయ్యడం!

బ్రహ్మచారి, విద్యను పూర్తి చేసుకుని కుటుంబపోషణకు అర్థం సంపాదించి వివాహం చేసుకోవాలి. విద్య పూర్తి అయ్యాక వివాహం చేసుకోవాలనే కోరిక ఉండడం స్వాభావికం.

ఏవో కొన్ని పరిస్థితులవల్ల కొందరు బ్రహ్మచారులుగా ఉండిపోవలసి వస్తున్నది. కాని ఇచ్ఛికంగా యావజ్జీవం బ్రహ్మచారులుగా ఉండిపోవడం మాత్రం చాలా అరుదు. కొందరు—తల్లిదండ్రులనూ, సోదర సోదరీమణులనూ పోషించవలసిన బాధ్యత తమపైపడి ఉండడంవల్ల— ఆ బాధ్యతతోపాటు తమ కుటుంబాన్ని పోషించే బాధ్యత తీసుకోలేక బ్రహ్మచారులుగా ఉండిపోతున్నారు. తమ అక్కలకూ, చెల్లెళ్ళకూ వివాహం అయితేనేగాని, తాము వివాహమాడకూడదనే గట్టి పట్టుదలతో—తమ సంకల్పం నెరవేరక కొందరు బ్రహ్మచారులుగా ఉండిపోవలసి వస్తున్నది.

గృహస్థు అయినవాడికి మూడు ఏషణాలు ఉంటాయి. ఏషణ అంటే కోరిక. మొదటిది దారైషణ. అంటే భార్య కావాలనే కోరిక. ఈ కోరిక వుండనివారు అరుదు. ఒక ముసలివాడును మనుమడు హాస్యం చేస్తూ 'తాతా! పెళ్ళి చేసుకుంటావా?' అని అంటే— దాన్ని యథార్థంగానే భావించి ఆ తాత 'నాకీ వయస్సులో పిల్లనిచ్చేవాళ్ళెవరురా?' అని ఎదురు ప్రశ్న వేశాడట! పిల్లనిస్తే పెళ్ళి చేసుకుందికి ఆ వయస్సులో కూడా కోరిక ఉంటుందన్నమాట!

ఎప్పుడయితే వివాహం జరిగి గృహిణి యింటికి వస్తుందో — అంతకుపూర్వం డబ్బుపై కోరిక లేకపోయినా అప్పటి నుంచీ దాన్ని సంపాదించాలనే కోరిక పుట్టక తప్పదు. డబ్బులేకపోతే సంసారం గడవదు. డబ్బు సంపాదించకపోతే భార్య ఊరుకోదు. సంపాదించలేకపోతే ఈసడింపు తప్పదు. ధనంపై వుండే యీ కోరిక ధనైషణ. ఇది రెండోది. దారైషణను వెంబడించే యిది వుంటుంది.

మూడవది పుత్రైషణ — అంటే పుత్రుడు కావాలనే కోరిక. దీన్ని నెరవేర్చుకోవడం కోసం గొప్ప తపస్సులూ, పుత్రకామేష్టులూ చేసిన వారుకూడా ఉన్నారు. పుత్రుడు కూడా వున్నప్పుడే పురుషత్వం పరిపూర్ణం అవుతుందట! పుత్రశబ్దంవల్ల పుత్రికకూడా గ్రహించబడుతుంది. సంతానం లేనివారి యిల్లు అడవితో సమానమని అంటారు. అందువల్ల పుత్రైషణకూడా అవశ్యకమే!

ఈవిధంగా ఏషణ మూడు విధాలుగా ఉంటుంది.

ఏషణ అంటే 'యాతన' అని కూడా అర్థం. భార్య తన్ను సరయైన రీతిని చూచుకోపోయినా, పుత్రుడు నిర్లక్ష్యం చేసినా యాతనగానే ఉంటుంది. ధనంపైని కోరిక ఉండవలెనేకాని, అత్యాశ వుంటే దానివల్ల యాతన పడవలసినదే! యాతన అంటే బాధ అని అందరికీ తెలుసుగదా! ●

## అనామధేయుడి ...

అంటే—మరి లోకాభిరామాయణం సాగించడానికి వీల్లేనంత ప్రశాంతరంగానున్నా, గోంగానున్నా! విస్సన్నగారు ఈ న్యూసెన్స్‌ని మరి భరించలేకపోయేరు. అవతల పెద్ద మనుష్యులమాట పూర్తిగా మరిచిపోయేరు. ఒక్కసారిగా హుంకరించేరు: 'ఎందుకురా. అలా వస్తున్నారు? నేనిక్కడ పెద్ద మనుష్యులతో మాట్లాడుతూ వుంటే!' —ఆ కేకతో పాలోమని ఈ నలుగురూ రావడం—అలోమని ఆ యిద్దరు పెద్ద మనుష్యులూ చల్లగా జారుకోవడం ఏక కాలంలో జరిగేయి.

ఆనక—ఆ పెద్దమనుష్యులు ఇద్దరూ దొంగలని తేలిన తర్వాత విస్సన్నగారి ఆశ్చర్యానికి హద్దులేదు. పెద్దమనుష్యుల పెద్దమనిషి తరహాకి భంగం కలిగించే ఆ రెండు మురుగులూ ఒక మంచి శుభముహూర్తాన తీసేశారనుకోండి. నిజంగా, మా తండ్రిగారైన విస్సన్నగారు చాలా పెద్దమనిషి!

**బా ల కాం డ ం**

**'బాలాదపి సుభాషితమ్'**

కొండూరి విస్సన్నగారికి, లచ్చమ్మగారికి నేను జన్మించేను. నేను సకల గుణాభిరాముడనని నేను పుట్టినప్పుడే అందరూ అనుకున్నారట. ఆ సంగతి అక్షరాలా నిజమని తర్వాత తర్వాత తెలిసింది. నా సంగతి నేనే చెప్పుకుంటే అది ఆత్మశ్లాఘ కిందికి వస్తుంది. పరసందర్భాన్నా ఆత్మశ్లాఘన నెయ్యిరెట్లు నెయ్యం అనుకోండి. అది వేరే సంగతి. అయితే 'సొంతడబ్బా' మాత్రం మంచిది కాదు. అందుచేత మా అన్న నా మీద రాశాడో, కానినాడో దేవుడికి తెలుసు. రెండు పద్యాల్ని మాత్రం ఇక్కడ పొందుపరుస్తాను దాంతో కొంత వరకూ మీకు నా సంగతి బోధపడ్తుంది:

కం. దెబ్బను రెండక్షరములు
అబ్బురముగ తింటిగని అల్లరి జబ్బుకొ
నిబ్బరముగ హరియించును
దబ్బర మాటలివి గావు తథ్యము '.
సుమతీ!

ఆ.వె. కుచికి సూచింబు చురుకున తాబేలు
పనుల కొత్తి, గ్యాతముకు ఖరము,
బిస్సన్నగారిముంలంను పస్సు మాస్కా
గారి
బెస్తు ఎనమ్ముందు లిస్తు మారన్న!!

**(ఇంకా ఉంది)**

# ప్రశ్నోత్తరం

...కె. రామలక్ష్మి

**బి. ఏ. ఆర్, తమిరిశ**

మీ కులం ఏమిటో తెలుపుతారా ?

కొత్తగా ఏర్పడిన — వెనుకబడిన తరగతి — బ్రాహ్మిన్.

**పి. ర్. కె, సికింద్రాబాదు**

ఒక స్త్రీని తల్లి, అన్న, కూతురు, భర్త — అంతా వదలివేస్తే ఆ స్త్రీ ఏం చేయ కల్గుతుంది ?

కోర్టుకెళ్ళి మనో వర్తికి పడేస్తుంది. భర్త గారిమె సంపాదన మీద బ్రతికే వాడైతే—అంతా వదలినా—తాను వదలడు.

**ఏ. ఆర్. కె, నిడపనకల్లు**

మనిషికి సుఖం ఎందుకు ఉండదు ?

అత్యాశ చేత.

**సి. ఎస్. ఆర్, హైద్రాబాదు**

మీ రింతవరకు ఎన్ని సన్మానాలను చేయించుకున్నారు ?

ఇంకా సన్మానాల ఏజెంట్లు నాదాకా రాలే దండీ...

**కె. ఎస్. ఎస్, గౌలిపుర**

మంచిపేరు రావలెనన్న ఏమి చేయవలెను?

మంచిగ బ్రతుక వలెను.

**ఎస్ బి. ఎచ్. ఆర్, ఖ త్రా**

చాలామంది పాఠకులు మీ పర్సనల్ విషయాలు అడుగుతారు. ఈ కీర్తిక మీ సొంతమా ?

ఇది రాస్తూన్నంత కాలం.

**వి. ఎస్. ఆర్, నరసన్నపేట**

శీలం నిర్వచించండి.

మన వ్యక్తిత్వపు విలువ.

**పి. ఎస్. ఎమ్, : వచాప్**

**(రాయ్‌పూరు)**

పూనా ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ అడ్రసు తెలుపగోరుతాను.

ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ పూనా. అంటే చాలు.

**కె. వి, కొయ్యలగూడెం**

పుడుతూనే బిడ్డ ఏడుస్తాడు. ఎందుచేత ?

ఈ లోకాన్ని చూసికాదు. ప్రాణం పోసుకున్న చిహ్నంగా ఏడుస్తాడు. ఊపిరి తిత్తులొక్కసారి నిండి అప్పటిదాకా ఖాళీగా ఉన్న ప్రాణికి కొత్త ప్రాణం వస్తుంది.

**సి. హెచ్. ఎస్. కె, కరీంనగరు**

మీకు దేశంమీద భక్తి ఎక్కువ అని విన్నాను. నిజమేనా ?

సినిమా అయిపోయాక నేషనల్ ఏంథమ్ అయేదాకా వుండడం — దేశభక్తి చిహ్నం అయితే నాకు దేశభక్తి ఉన్నట్టే లెక్క. అంతే కాదు. ఎంత సేపూ మనదేశ దౌర్భాగ్యాన్నే చిలువలూ పలవలుగా చెప్తూ, దాన్ని ఔన్నత్యాన్ని కించిత్తు కూడా పట్టించుకోని వాళ్ళతో—దెబ్బలాటకి కూడా దిగుతాను—ఇదే దేశభక్తి చిహ్నం అంటే నాకుదేశం అంటే యిష్టం వున్నట్టే. ఫారిన్ వస్తువులపై మోజు లేకపోవడం చేనేత, పట్టులే వాడడం, యివన్నీ మీ దృష్టిలో దేశభక్తి చిహ్నాలైతే, నాకూ ఉంది దేశభక్తి.

**కె. ఆర్. సి హెచ్, మాకులూరు**

**(నిజామాబాదు)**

మీ జవాబులు చదివిన స్త్రీలు తాము స్వతంత్రంగా జీవించలేమా అనే అహం భావంతో ఉన్నదీ కాస్తా వదులుకొంటు న్నారు. దయచేసి కాస్త అహం విడిచి జవాబులు వాంఛిస్తున్నాము.

ఏమిటీ? మంత్రాలకు చింత కాయలు రాలుతున్నాయా! అయ్యా రామాచారిగారూ, నేను నేనుగా ఉండడం అహంకారానికి చిహ్నం అయితే నేను— అహంకారినే. ఏం? ఆడది ఆర్థిక స్వాతంత్ర్యం లేనంత మాత్రాన కిక్కురుమనకుండా పడివుండా లని లేదే? మరీ తరిమితే పిల్లికూడా పులిలా మీద పడుతుంది. తన భర్తకు నచ్చినట్టు కంటే తన కాహ్లాదం యిచ్చేరీతిన ఆడది ఉన్నంతమాత్రాన బరి తెగించిందనీ, ఇలా సంసారం అంటే— అభిమానంలేదని ఎందుకనుకుంటారు? మీరింకా చాలా ప్రిమిటివ్‌గా ఆలోచిస్తున్నారు. ఆడతనం ఈ ఆధునిక కాలంలో ఆడదాని అభ్యుదయానికేం అడ్డం కాదు.

**ఎస్. ఎస్, విశాఖపట్నం**

స్త్రీ తన బాధలను కన్నీరుగా మార్చి హృదయభారం తగ్గించుకోగలదు. కాని మగవానికా అదృష్టం లేదు.

ఎం. మీ కేడవ లేదా?



<u>పెద్దకథ</u>

# పద్మవ్యూహం

సింగరాజు రామచంద్రమూర్తి

(గత సంచిక తరువాయి)

మర్నాడు సాయంత్రం వెడితే ఉమా వాళ్ళు బాధపడతారేమో అనుకుంటూనే బయలుదేరింది వాళ్ళింటికి విజయ. గుమ్మంలో కారు ఆగి ఉంది. పక్కనే నిలబడి ఉన్నాడు జానకిరాం ఫుల్‌సూట్‌లో అంతెత్తు మనిషి అలా నిలబడి ఉంటే 'ఆజాను బాహువుకి నిర్వచనం ఇతనే కాబోలు' అనిపించింది విజయకి.

'రండి రండి ఇంత ఆలస్యమా? జీవిత కాలమంతా మీకోసం నిరీక్షణలోనే గడిచేట్టుందే నాకు' అని నవ్వుతూ 'లాభం ఉంటుందంటే మహానందంగా వెయిట్ చేయగలను సుమండీ' అన్నాడు మెల్లిగా.

ఒళ్ళంతా సిగ్గుపడిపోయింది విజయ. 'నిద్రపట్టేసింది' అంది.

'అదృష్టవంతులు. నాకు నిన్న సాయంత్రం సరిగా ఇదేవేళనుంచి కంటికి కునుకు లేదు. నిద్ర నాదగ్గరకు రానంటోంది ఏం చేయమంటారు?' అన్నాడు ఆమె కళ్ళలోకి చూస్తూ.

ఉమ వచ్చింది అంతలో. 'చాలా సేపయిందా వచ్చి' అంది.

'వచ్చి చాలాసేపయినా నా కిప్పుడేలా ఉంది' అన్నాడు జానకిరాం!

ఉమ ముఖం చిట్లించుకోవటం చూసి 'ఇప్పుడేనోయ్, లోపలికి రాబోతూంటే ఈయన అగపడ్డారు. చాలా సేపయ్యిందంటారేం?'

'ఈరోజు ఉమ. పార్వతి మీరు నేను— పార్టీని తగ్గించేశాం!'

'కారు ఎవళ్ళది ఉమా?' అడిగింది విజయ.

జానకిరామే అందుకున్నాడు. 'నాతోపాటు చదివాడులెండి భాస్కరుడు, వాడు ప్రయివేటు

ప్రాక్టీసు చేస్తుండటం వలన కారు, మేడ భార్య అమర్చుకున్నాడు. నాకింకా ఏదీ అమర లేదు'

'మీరూ అలాగే చేయలేకపోయారా?'

'ఇందాకటి వరసలో ఆఖరుది ముందు వస్తే మిగిలినవి ఎంతసేపండి. బోర్డు పెట్టిన రెండేళ్లలో సంపాదించవచ్చును ఈరోజుల్లో. ప్రతి వాళ్లకి డాక్టరు దగ్గరకు పరుగెత్తడం ఫాషనయి పోయిందిగా!'

అందరూ కలిసి సముద్రం దగ్గరకు వెళ్లారు కారుమీద.

'సముద్రానికి ఇంత దగ్గర్లోనే ఉండ గలగడం మీ అదృష్టం. చూడండి ఎంత అందం ఉంటుందో—ప్రకృతిలోని చైతన్యం అంతా కనబడుతుందిక్కడ' అన్నాడు జానకిరాం.

విజయ మాట్లాడలేదు.

పార్వతి అంది 'అందమయినదేకాని ఎంత అందమయినదో అంత క్రూరమయినది కూడా—ప్రాణం పూర్తిగా పోతేగానీ బయటికి వదలదు. అవసరం అయిపోయాక క్షణం ఉంచుకోదు, అందముండి ఏం లాభం?'

'వేదాంతం మాట్లాడుతోంది లెండి మా మేనకోడలు. శివుడి గురించి తపస్సు చేయాలిగా మరి పేరు పెట్టినందుకు!'

'వేదాంతం అన్నదేమిటంటావు? జీవి తాన్ని తరచిచూసి అనుభవించిన వాళ్ళు చెప్పినది. జీవితసారం అన్నమాట. అను భవం లేనివే చెప్పినదేదీ నిలవదు. అనుభవం మీద చెప్పినదాన్ని లక్ష్యపెట్టకపోతే నష్టం కూడా' అంది ఉమ.

'సర్లేసర్లే, సరదాగా ఇక్కడికి వచ్చాం మనం రండి మిస్ విజయా, వాళ్లిద్దరూ తాత్వికచింతన వగయిరాలు మాట్లాడు కుంటూ ఉంటారు మనం అలా తిరిగి వద్దాం'

విజయ కదలలేదు.

పార్వతి వాళ్లిద్దరివంక చూసి అలలకేసి కదిలింది. అక్కడ పీతలు చేసుకున్న బొరియలమీదికి నీరువచ్చి వాటిని ముంచే స్తోంది! మళ్లీ నీరు వెళ్లిపోగానే పీతలు వాటి ఇళ్లు వెతుక్కుంటూ తిరుగుతున్నాయి. వాటిని చూస్తూండి పోయింది పార్వతి.

శంఖాలు ఏరుకుంటూ తిరుగుతోంది ఉమ.

'ఈ సరుగుడు చెట్లకేసి ఎప్పుడయినా వెళ్లారా మీరు విజయా, రండి ఎంత బాగుంటుందో చూద్దురుగాని బారులు బారులుగా వేస్తారు వాటిని. పెద్దవయ్యాక వరసగా బోలెడు స్తంభాలు పాతినట్టు అగపడుతుంది. అసలు నాకనిపిస్తుంటుంది. ఈ సరుగుడు చెట్లబదులు జీడిమామిడి వేస్తే చాలా లాభం అని... చూశారు ఇక్కడి వాళకిది పిక్నిక్ స్పాట్, నా చిన్నప్పుడు భోజనాలుగాని, ఫలహారాలుగాని తెచ్చుకుని తినేవాళ్ళ మిక్కడ.'

కబుర్లు చెబుతూ నడుస్తున్నాడు జానకిరాం. తెలియని ఆందోళన కలుగు తున్నా అతన్ని అనుసరిస్తోంది విజయ. కొంతసేపటికీ తెప్పరిల్లి చూస్తే తాను జానకిరాంతో ఒంటరిగా చెట్లమధ్యన ఉందన్న విషయం గ్రహించింది. చిన్న గుబురులాంటిది తామిద్దరికీ సముద్రం కనబడకుండా చేస్తోందన్న సంగతికూడా తెలుసుకుంది.

'చూడండి విజయా దేముడి ఉనికిని నమ్మనివారు కూడా జాతకాలు, రేఖలు నమ్ముతారు. నేను గ్రహించినంతవరకు చేతిలోని మన రేఖలు భగవంతుడు ఊరికినే పెట్టలేదన్నది. కొంతవరకు చదివాను వాటిగురించి. ఏదీ మీ చేయేది' అంటూనే ఆమె ఎడమచేతిని చొరవగా తీసుకుని తన అరచేతిలో పరిచాడు.

కాసేపు పరీక్షగా చూసి 'చాలా మంచి లైఫ్‌మీది. అసలు మీచేయి చూస్తేనే ఎవరయినా ఎగిరి గంతేసి పెళ్లి చేసుకుం టారు మిమ్మల్ని...మీకు ఇద్దరు పిల్లలు' అని ఆమెవంక చూశాడు నవ్వుతూ.

సిగ్గుతో తలవంచుకుంది విజయ. బుగ్గలు ఎరుపెక్కాయి.

'మీకు అతిత్వరలో వివాహ మవుతుంది. అందమయినవాడు, సహృదయుడు మిమ్మల్ని దేవతలా చూసుకునేవాడు వస్తాడు మీకు, మీకు కారుంటుంది, మేడ ఉంటుంది. చేసుకోబోయేవాడు వైద్యవృత్తి...'

ఫక్కున నవ్వింది విజయ.

గబాలున దగ్గరకు లాక్కున్నాడామెని. అతని చేతుల్లోంచి తప్పించుకునే ప్రయత్నం చేయలేదామె. దగ్గరకు ఇంకా దగ్గరకు తీసుకున్నాడామెని.

వెనక వీపుమీద ఏదో తగిలినట్టయితే వెనక్కి తిరిగిచూసింది— బంతిపడి ఉంది వెనక. ఆ వెనకగా ఆయాసపడుతూ వస్తోంది పార్వతి!

చటుక్కున వదిలేశాడు విజయని.

'రా విజయా, చీకటి పడుతోంది. ఇంటికి పోదాం' అంటూనే ఆమె చేయి పుచ్చుకుని బరబర తీసుకువెళ్లిపోయింది పార్వతి.

తిరిగి వస్తుంటే బలవంతంమీద విజయని ముందుసీట్లో తనపక్కన కూర్చో పెట్టాడు జానకిరాం. ఒకచేత్తో స్టీరింగ్ పట్టుకుని ఒకచేత్తో సిగిరెట్టు తాగుతూ అతను స్పీడుగా డ్రయివు చేస్తుంటే విజయకి హిందీ సినిమాల్లోని తన అభి మాన హీరో కళ్లకగపడ్డాడు. అయితే ఉమ, పార్వతి ఇద్దరూకూడా దారిలో ఏమీ మాట్లాడకపోవడం ఆమెని కొంచెం ఇబ్బందిలో పెట్టింది. తనేదో తప్పు చేసినట్టు వాళ్ళు తనవంక చూడడం ఆమె మనస్సుకి కష్టాన్ని కలిగించింది. ఎప్పుడెప్పుడు ఇంటికి వెళ్లిపోదామా అన్నంత ఆత్రుతతో కారు దిగగానే 'మరినే వెడ తున్నాను ఉమా' అంది.

'అలాగే పార్వతిని వచ్చి మీ ఇంట్లో దింపమంటానా?'

'అక్కర్లేదు రోజూ ఎవరొస్తున్నారుట నాకు సాయం' అని బయలుదేరేంతలో చేయి పుచ్చుకుని ఆగమన్నట్టుగా చూశాడు జానకిరాం. ఉమ, పార్వతి లోపలికి వెళ్లి పోగానే 'ఒక్కసారి నా వెంటరా క్షణంలో వెళ్లిపోదాం' అన్నాడు.

'ఏమయినా అనుకుంటారు వాళ్ళు! నేను వెళ్లిపోగలను మీరు రానవసరం లేదు.'

'ఒకరనుకుంటారని మనం ఎన్నాళ్లు భయపడతాం విజయా, రండిరండి' అం టూనే ఆమె చేయి పుచ్చుకుని బరబర పైకి లాక్కు వెళ్లిపోయి నేరుగా తనగదిలోకి తీసుకు వెళ్లిపోయి తలుపు ఓరగా వేసేశాడు. ఏమి జరుగుతోందో ఆమెకి తెలిసేలోపలే అతని కౌగిట్లో ఇమిడి పోయింది. ఆమె పెదవులమీద బలమయిన అతని పెదవులు-ఆనాయి!

'విజయా!' అన్న పిలుపుతో విహ్వలవ అతన్ని వదిలించుకుని దూరంగా జరిగింది విజయ

గుమ్మంలో పార్వతి నిలబడి ఉంది.

'వ్హాట్' అన్నాడు కోపంగా జానకిరాం.

'నిన్నుకాదు — విజయని! అక్కయ్య పిలుస్తోంది విజయా నిన్ను' అని విజయ కదిలేదాకా అలానే నిలబడి తరువాత ఆమె వెనక నడిచింది పార్వతి.

గది గుమ్మంలోనే నిలబడి తననే నిశితంగా చూస్తున్న ఉమని చూడలేక తల వంచుకుంది విజయ.

'ఇటువంటిది జరుగుతుందనే పార్వతిని పంపించాను....లోపలికి రా' అంది కోపంగా ఉమ.

లోపలికి వెళ్ళాక అదే స్వరంతో 'మా మావయ్య మంచివాడు కాదు విజయా, నువ్వతనితో మరీ చనువుగా ఉంటున్నావు' అంది.

విజయ ఏమీ మాట్లాడకుండా ఆమె ముఖంలోకి చూసింది. అక్కడామెకు బాధ ప్రస్ఫుటంగా అగపడింది. జాలేసింది విజయకి. వెనక్కి తిరిగి వచ్చేస్తుంటే జానకిరాం నిలబడిఉన్నాడు వీధిలో.

'కారెక్కు నిన్ను డ్రాప్ చేసి మా భాస్కరుడికి కారు వప్పచెప్పి వస్తాను. లేకపోతే వాడిక్కారు ఇచ్చేసి సరదాగా నడుచుకుంటూ మీ ఇంటికి వెడదామా' అనడిగాడు నవ్వుతూ.

విజయ అతనివంక చూసి తందించుకుని 'ఏం అక్కరలేదు లెండి నే వెళ్ళిపోతాను' అంది.

'వ్హాట్ ? అంతలో మారిపోయావేమిటి' అని దగ్గరగావచ్చి నవ్వుతూ, 'నేను మంచివాడిని కానని చెప్పిందా ఉమ మీకు. లేక పార్వతి చెప్పిందా' అనడిగాడు.

ఆశ్చర్యపోయింది విజయ. 'ఉమ !... ఎలా తెలుసు ?'

ఫకాలున నవ్వేశాడు. 'ఎప్పుడూ జరిగే దేగ ఈ తంతంతా! రేపు వివరించి చెబుతాగాని రిక్షాపిలుస్తాను అందులో వెళ్ళిపో. లేకపోతే మరీ పిచ్చి ఈరోజు నాకు అన్నంకూడా పెట్టరు.'

విజయకి దారంతా ఆలోచనలతోనే సరిపోయింది.

మర్నాడు సాయంత్రం జానకిరామే విజయ ఇంటికి వచ్చాడు. 'నువ్వు వాళ్ళ ఇంటికి వస్తే వాళ్ళు ఖంగారు పడుతున్నారని నేనే వచ్చాను.'

విజయ అతన్ని పద్మావతికి పరిచయం

# పద్మవ్యూహం

చేసింది. 'నే చెప్పలే, ఉమ వాళ్ళమావయ్య ...డాక్టరుగారు' అని.

'అయితే చెప్పావన్న మాట నాగురించి. దట్స్‌గుడ్. మీ అమ్మాయి చాలా మంచిదండి. పాపం అమాయకురాలు, నిన్నను మావాళ్లేదో అంటే బాధపడిపోయింది.'

'నేనేం బాధ పడ్డాను ? అయినా ఉమ అన్నది మీగురించేగా !'

'ఏమందేమిటి ?' అడిగింది. పద్మావతి. ఆవిడకి జానకిరాం, విజయ అలా పక్కపక్కగా నిలబడి మాట్లాడుతుంటే చాలా ముచ్చటగా ఉంది.

'ఏముందండీ ఈవిడకిది కొత్తగాని నాకు మామూలే! ఈ రెండు నెలలపాటు నా చుట్టూ ఇలా గోడకట్టలేక నానా యాతనా పడతారు.'

'ఏమిటో అర్థం కావడంలేదు మీ మాటలు' అంది విజయ.

పద్మావతికీ అర్థం కాలేదు. ఆమాటే చెప్పింది కూడా.

నవ్వాడు జానకిరాం. 'రోజూ వాళ్ళని చూస్తున్నా గ్రహించుకోలేదు మీ అమ్మాయి—చెప్పాగా అమాయకురాలని. అది కాదు విజయా. నేను సంవత్సరానికి రెండు నెలలు శలవుమీద వస్తాను. మావాళ్ళ ఉద్దేశ్యం ఏనాటికయినా నేను ఉమ, పార్వతులలో ఎవరినో ఒకరిని చేసుకోవాలని! ఇద్దరిని చూస్తున్నావుగదా—ఎలా చేసుకుంటాను ? మరీ అప్సరసలు కాకపోయినా కనీసం వెంటేసుకుని వెడితే నన్నుచూసి జనం జాలిపడకుండానయినా ఉండాలా ?'

తల్లీ కూతురూ నవ్వారు.

'మీది మరీ చిత్రం, ఉమకేం చక్కగా ఉంటుంది. మా కాలేజిలో తనంటే పడిచచ్చేవాళ్ళు చాలామంది ఉన్నారు.'

'చచ్చేవాళ్ళు అంతమంది ఉండగా నేకూడా చావడమెందుకు ?... అదండి. నేనెప్పటికప్పుడు ఈ శలవు రెండునెలల్లో ఎక్కడయినా సంబంధం చూసి ఖాయపర్చుకుందా మనుకుని వస్తాను. మా బావ, అక్కయ్య నన్నుగురించి ఎవరయినా వచ్చి అడిగితే 'వాడొట్టి లోఫర్, ప్రమాదకరమయిన వ్యక్తి. తరువాత మీ ఇష్టం.' అని

బెదర కొడతారు!

వీళ్ళిద్దరేమో ఆ అమ్మాయిల్ని చాటుకి పిలిచి 'మావయ్య మంచివాడు కాదు జాగ్రత్త' అని చెబుతారు. ఇలా ఎవరినీ నాదగ్గరకు రాకుండా కోటగోడ కట్టేస్తున్నారు. మరి నేమాత్రం ఇన్నాళ్ళని వంటరిగా ఉంటాను—ఎప్పటికయినా విసిగిపోయి వీళ్ళిద్దరిలో ఒకరిని చేసుకుంటానని వాళ్ళ ఆశ!'

కాసేపు ఎవరూ మాట్లాడలేదు. మళ్ళా జానకిరామే ఆవేశంగా అన్నాడు. 'అవునండి నేను పెళ్ళి చేసుకునేందుకు అన్ని అర్హతలూ కలవాడినీ, నా ఇష్టప్రకారం ఎందుకు జరక్కూడదు? ఆడపిల్లకి పెళ్ళి చేద్దామనుకునేవాళ్ళు ఏం చేస్తున్నారు ? బాగా కట్నం ఇవ్వకలిగినవాళ్ళు వాళ్ళకి నచ్చిన వాళ్ళని—కొండమీద కోతుల్ని—తెచ్చుకుంటున్నారు ఎందువలన? 'డబ్బు', అన్న అర్హత వాళ్ళకుంది కనుక. అలాగే నాకు ఎంతకావలసినా కట్నమిచ్చేందుకు చాలామంది సిద్ధంగా ఉన్నారు. కాని నేను పైసపుచ్చుకోను. అటువంటప్పుడు ఎన్నిక చేసుకోవడం నా ఇష్టం. నేను అంత డబ్బు వదులుకుంటున్నప్పుడు దానికి బదులు నా మనస్సుకి పూర్తిగానచ్చే మనిషి నాక్కావాలి! నాకు కావలసింది అందం. తరువాతే చదువు. అటువంటి అమ్మాయికోసం నేనిన్నాళ్ళూ వెతికాను' అని విజయవంక చూసి నవ్వి 'అటువంటిదాన్ని నాదాన్ని చేసుకోవడం నా హక్కు' అన్నాడు.

పద్మావతి కూతురువంక చూసింది. విజయ తలవంచుకూర్చుంది. ఆమె ముఖమంతా గులాబివన్నె తిరిగి ఉండడంచూసి పద్మావతి నవ్వుకుంది.

'అన్నట్టు విజయా, మీ అమ్మగారికి మా అక్కయ్యతో పరిచయం ఉందా?' అడిగాడు జానకిరాం.

'ఆఁ, బాగా తెలుసు'

'అయితేనండోయ్ మా అక్కయ్య మీక్కూడా చెబుతుంది నా గురించి—చూస్తుండండి ... పిల్లల్తో చెబుతూంటే చివరికి నాకే అనుమానం కలుగుతుంటుంది నిజంగా నేను మంచివాడిని కానేమోనని'

ముగ్గురూ నవ్వేశారు. అంత నిష్కల్మ

(52వ పేజి చూడండి)



అలసిపోయి ఆఫీసునుంచి వచ్చిన గోపాలం బూటులేసు విప్పతూ అడిగాడు మంజులను 'అత్తయ్యా వాళ్లు వెళ్లారా!' అని—

కాఫీ కప్పును ప్రక్కనేవున్న టేబుల్ మీదవుంచి 'ఆఁ! ఇందాకే వెళ్లారు!' అన్నది మంజుల.

గోపాలం తలఎత్తి మంజులను పరీక్షగా చూశాడు. ముఖం అలసటను చూపిస్తున్నా ముచ్చటగావుంది — కళ్లు బరువుగావున్నా అందంగా మెరుస్తున్నాయి.

ఆమె నడుంచుట్టూ చేయివేసి దగ్గరకు లాక్కున్నాడు. ఏదో చెప్పబోయి ఆగిపోయాడు.

'ఏమిటి ఆగిపోయారు' — చిన్నగా నవ్వుతూ అడిగింది మంజుల.

అతను జవాబు చెప్పలేదు యింకా దగ్గరకు లాక్కున్నాడు.

'అబ్బాయి — సామాను యిలా ఈ ప్రక్కన పెట్టు—అరే—ఆ బుట్ట జాగ్రత్త—దాంట్లో గాజుసామాన్లు వున్నాయని చెప్పలేదూ!'

మంజుల చటుక్కున గోపాలాన్ని వదిలించుకుని, గదిలోంచి బయటకు వచ్చింది.

'రా రా జగన్నాధం – ఇన్నాళ్లకి మేం కనపడ్డాం అన్నమాట — అంతా కులాసానా— ముందు కాళ్లు కడుక్కోండి — ఏయ్ సావిత్రీ యిలా రా— కాళ్లు కడుక్కోటానికి నీళ్లు తీసుకురా—' చకచకా ఆర్డర్ జారీచేశాడు నరసింహం— గోపాలం తండ్రి.

జగన్నాధం — అతని భార్య జానకి — నలుగురు పిల్లలూ వారితో సామానూ— చూడగానే గోపాలానికి అప్రయత్నంగా ఎదురుగావున్న కాలెండర్లోని ఇరవై ఆరో తారీఖు ఒక పెద్దభూతంలా కనపడి భయపెట్టింది. కాఫీతో ఎండిపోయిన గొంతు తడుపుకున్నాడు.

'ఏరా జగన్నాధం — నీకెప్పుడో వుత్తరాలు వ్రాశాను రమ్మని – యిన్నాళ్లకి తీరిందన్న మాట నీకు. అది సరే కాని మీరు మాత్రమే వచ్చేరేమిట్రా — విశ్వనాధం, రామనాధం ఏరీ—శ్యామల్నీ, సరోజనీ చూసి ఎన్నాళ్ళయిందో—మీ నాన్న బాగానే తిరుగుతున్నాడు గదా — తీసుకురాలేకపోయావా — అయినా మీ నాన్నకి మహాబెట్టులే — యింటికివచ్చి పిలుస్తేకాని మాయింటికిరాడు. ఏమయినా ఆ దర్పం, బెట్టూ మీలో ఎక్కడుందీ—' నరసింహం వాక్ప్రవాహానికి అడ్డం వస్తూ అన్నాడు జగన్నాధం—

'లేదు మామయ్యా—మేముకూడా అసలు అనుకుని రాలేదు. హైదరాబాద్‌లో సుబ్బా

రావ్ బాబాయి వాళ్లింటికి బయల్దేరాం. నరసరావ్ పేటనుంచీ గుంటూరు దాకా బాగానే వచ్చింది రైలు. కానీ గుంటూరులో నాలగింటికి బయల్దేరిన వాళ్లం యిక్కడికి వచ్చేసరికి ఆరయింది. ఇరవై మైళ్ల ప్రయాణానికి రెండుగంటలా—మరీ మన రైల్వేస్ అధ్వాన్నంగా తయారయాయి. పదే అయిదున్నర బండీ ఎలాగూ పోయింది కదా రాత్రి బండికి పోదంలే అనుకున్నాం. స్టేషన్లో కూర్చోవటం ఎందుకని—ప్రక్కనే కదా అని మీయింటికి వచ్చాం—' జగన్నాధం వాక్ప్రవాహానికి అడ్డం వస్తూ అన్నాడు నరసింహం—

'అంటే మాయింటికి రావాలని రాలేదన్న మాట—అవున్లేరా—మీకు బంధుత్వాలూ, బంధుత్వాల విలువలూ ఏం తెలుసు - మేమేదో పాతకాలం వాళ్లం కనుక యింకా ఆ ప్రేమలూ—అనురాగాలూ—'

'ఛ—అదేమిటి మామయ్యా భలేవాడివే —అమాత్రం అభిమానం లేదంటావా—నరాసరి వెళ్లలేకనా— మేము నీ యింట్లో దిగింది—పెద్దవాడివి నిన్ను చూస్తే అదో విధమైన అభిమానం పుట్టుకొస్తుంది. మా అందరికీనూ...'

గోపాలం వద్దనుకున్నా వినపడుతునే వున్నయి-తన తండ్రి నరసింహం, దూరపు చుట్టం జగన్నాధంల మాటలూ—ఒకళ్ల వాక్ప్రవాహానికి మరొకరు ఆనకట్టలువేస్తూ మాట్లాడుతున్న తీరూ—

'మా కోడల్ని చూశావుకదా జానకీ— చాలా నెమ్మది. అన్ని పనులూ చక్కగా చేస్తుంది— చదువుకి తగ్గ సంస్కారం—' అత్తగారు తనని పొగుడుతూవుంటే అక్కడ కూర్చోలేక పోయింది మంజుల. ఏదో పని వున్నట్టుగా లోపలికి వెళ్లింది— వళ్లంతా కళ్లు చేసుకుని తననే చూస్తున్న జానకిని అలాగే వదిలేసి—

'ఒరే రామూ — ఈ రేడియోమీద బొమ్మ చూడరా—ఎలా తల ఆడిస్తుందో.' అంటూనే ఆ బొమ్మను తీసి ఎత్తి క్రింద పడేశాడు—వచ్చిన చుట్టంగారి పెద్దబ్బాయి.

ఠావ్మని శబ్దమవలేదు కానీ— మెత్తగా నాలుగున్నర ముక్కలయింది — గోపాలం బెంగుళూరునుంచి అపురూపంగా తెచ్చిన ఆ బొమ్మ, అతని కళ్ల ఎదురుగానే.

గోపాలానికి విపరీతంగా కోపం వచ్చింది,

# చుట్టాలొచ్చారు

కుర్చీలోనించి న్నరునలేచి — ఒకడుగు ముందుకు వేశాడు,

'ఏం బావా — నువ్విక్కడే వున్నావా-యిందాకటినుంచీ నీమాట వినపడక పోతే— బజారెళ్లా వేమో అనుకున్నాను. అరె- ఎవర్రా ఈ బొమ్మ పగలకొట్టింది — మావాడేనా. వాడు బలే అల్లరివాడు బావా— వయస్సుని మించిన అల్లరి వాడిది —అంతా వాళ్ళమ్మ పోలికే— ఒరే నాగన్నా —కాళ్ళల్లో గుచ్చుకుంటయి—ఆ ముక్కలు ఏరి అవతల పారెయ్—...ఆఁ బావా - నువ్వు రైల్వేలోనేగదా పనిచేస్తున్నావ్ — ఏమిటి బావా మీరైళ్లు—ఎప్పుడూ ఆలస్యమే— పేపర్లో ఈమధ్య బాగా నడుస్తున్నయి అని వ్రాశారు. అంతా వట్టిదే. కాకపోతే అది వరకు ఎనిమిదిగంటల లేటయితే—యిప్పుడు ఆరుగంటలు. అసలురైళ్లు యిట్లా అఘోరించటం మన ఆంధ్రాలోనే—ఇదే నార్త్లో అయితే...'

గోపాలం తనకు అపురూపమైన బొమ్మ పగిలిపోయిందనే బాధలో వున్నాడేమో జగన్నాధం మాటలు పట్టించుకోకుండా పగిలిన ముక్కలు ఏరి—ఒకసారి ఆప్యాయంగా చూసి-కిటికీలోనించి బయటకు విసిరేశాడు.

'మేం రాత్రి పదకొండున్నరగంటల బండికి వెడతాంబావా— అదన్నా కరెక్ట్గా వస్తుందంటావా-లేకపోతే అదీ...' జగన్నాధం మాటకు అడ్డొస్తూ అన్నాడు నరసింహం.

'అందుకే ఏబాధా లేకుండా రేపొద్దున గోల్కొండ ఎక్స్ప్రెస్కి వెళ్లండి. అదిక్కడి నుంచే బయల్దేరుతుంది కనుక ఆలస్యం అనేమాట వుండదు — ఏరా గోపాలం— అలా బావుంటుంది కదూ—'

గోపాలం నోరు తెరవకముందే అన్నాడు జగన్నాధం—'నువ్వలా అంటావని తెలుసు మామయ్యా—కాని ఎలా కుదరదే!'

'ఏమిటా కుదిరేది — అలా అయితే రేపూవద్దు — ఎల్లుండి గోల్కొండ ఎక్స్ప్రెస్లో వెళ్లొచ్చులే—రాకరాకవచ్చి చెప్పుల్లోంచి కాళ్ళు తీయనంటావేం !'

'నీతో వాదన నేనుకోలేను మామయ్యా —యింకా వాదిస్తే నాలుగురోజులు వుండమని బలవంతం చేస్తావ్—అందుకని యిక నీతో వాదించను. రేపిక్కడ కనకదుర్గగుడి, గాంధీపర్వతం చూసుకుని— నువ్వన్నట్టుగా ఎల్లుండి గోల్కొండకే వెడతాము—సరేనా!' నవ్వుతూ అన్నాడు జగన్నాధం.

జగన్నాధం భుజం తట్టాడు నరసింహం 'అలా వుండాలిరా— సరిగ్గా మీ నాన్నాయితే—నామాట కాదనలేక పోయే వాడు !'

'గోపాలం పెళ్లయి ఎన్నాళ్లయింది పిన్నీ !' అడిగింది జానకి మంజులను పట్టి పట్టి చూస్తూ—

'రెండేళ్లవుతుంది— రేపు వైశాఖానికి'

'మరి యింకా.. ఏమీలేదా !' అడిగింది జానకి.

జానకి మనసులోని భావం అర్థమయింది సావిత్రమ్మకీ, మంజులకీ.

విసుగ్గా అంది సావిత్రమ్మ' ఏమో— చదువుకున్న పిల్లలు—వాళ్ళ యిష్టం!'

'ఆఁ! అంతావట్టిదే — మన చేతుల్లో ఏముంది- కొంతమంది ఆడవాళ్ల శరీరం తీరు అంతే—తొందరగా పిల్లలు పుట్టరు—'

మంజుల కోపంతోనూ, సిగ్గుతోనూ వణికిపోయింది. సమాయించుకుని — తల వంచుకున్నది—

ఏదో అనబోతున్న సావిత్రమ్మతో అన్నాడు అప్పుడే వచ్చిన నరసింహం 'గోపాలం బజారెడుతున్నాడు—ఏం కావాలో చెప్పు'—

తల్లియిచ్చిన లిస్టు తీసుకుని బజారు వెడుతున్న గోపాలం మనసు మనసులోలేదు —ఆలోచనలు కాకుల్లా ముసురుకుంటున్నయి.

యిలా అయితే— యిక సంసారం ఎలా సాగుతుంది ? తనకీ జీతం తక్కువేంకాదు, దాదాపు ఆరువందలదాకా వస్తుంది అన్నీ కలుపుకుని. కాని ఇరవయ్యోతారీకు దాటగానే అప్పుకి బయల్దేరాలి. తనూ, తన భార్యా, తల్లీతండ్రీ ఆ ఆరువందలతో ఎంతో ఆనందంగా బ్రతకవచ్చు. కానీ ... తండ్రికి బంధుప్రీతి ఎక్కువ. బంధువులన్నా ఎక్కువే! చుట్టమయితేచాలు—వాడు ఎంత పధవయినా— నెత్తిన ఎక్కించుకుంటాడు, స్వార్థంగా నమ్ముతాడు. అలా నమ్మించి మోసంచేసి తన బంధువులు — తండ్రి ఆస్తిని తలాకాస్త పంచుకున్నారు. అయినా తన తండ్రికి వాళ్లంటే కోపంలేదు. తనకి

ఆ చక్కని,
పరిశుభ్రమైన తెల్లదనానికి

# ఓ ఓ బి® నీలి




ఓ.ఓ.బి నీలి నీటిలో అతి సులభంగా, పూర్తిగా కరుగుతుంది. తెల్లటి దుస్తులకి సమమైన మంచులాంటి తెల్లదనాన్నిస్తుంది. మీ చొక్కాలకు, చీరలకు, దుప్పట్లకు మరియు ఇతర బట్టలకు అధికమైన తెల్లదనాన్నివ్వడానికి ఇదే అతి పొదుపైన పద్ధతి. నీలపు మరకలుండవు. పసుపు రంగుగా మారదు.

ఓ.ఓ.బి నీలి భారతదేశంలోకెల్లా పెద్దదైన, ఆధునికమైన ఫ్యాక్టరీలో పశ్చిమ జర్మనీవారి సహకారంతో తయారుచేయబడుతున్నది.

తయారుచేయువారు:

**అల్ట్రామెరైన్ పిగ్మెంట్స్ లిమిటెడ్** అంబత్తూరు, మద్రాసు-53



UPL/6548

కావలసిన బంధువులు తన సొమ్ము తినక యింకెవరి సొమ్ముతింటారనే పాతతరం భావాల పూర్వకాలపు మనిషి. ఆయన యిచ్చిన అలుసునిబట్టే వచ్చే చుట్టాలకీ అంతువుండదు. ఆయన బంధు ప్రీతి గురించి చెప్పాలంటే—ఎన్నో చెప్పక్కరలేదు. ఆయన ప్రక్కన ప్రతిపూటా—కనీసం యిద్దరు ముగ్గురు బంధువులు భోజనం చేయాలి. లేకపోతే ఆయనకి భోజనం సయించదు. తను రైల్వేలో — రైల్వే స్టేషన్‌కి దగ్గరగా—అందులోనూ విజయవాడ జంక్షన్ రైల్వేస్టేషన్‌కి దగ్గరలోనే క్వార్టర్స్‌లో వుండటం మరీ గొడవయి పోయింది. రైలు దిగంగానే, రిక్షా ఖర్చు కూడా లేకుండా సరాసరి తనయింటికి వచ్చేస్తారు బంధువులు.

అప్పటికీ ధైర్యంచేసి ఒకటిరెండుసార్లు తండ్రిని కదిలించాడు గోపాలం. ఎందుకు చుట్టాలను పిలచి ఆర్భాటం చేసుకోవటం అని—

ఆయన చాలబాధ పడ్డాడు.

'చుట్టాలు మనం రమ్మంటే వస్తారు—ఏదో అభిమానంకొద్దీ వస్తారు—చూసి వెడతారు. అయినా

# చుట్టాలొచ్చారు

అందరికీ చుట్టాలు యింతమంది వుంటారా — వున్నా మనలాగా అభిమానంగా వుంటారా—ఎప్పుడూ యిలా అనకు — వచ్చి పోతూ వుంటేనే నిలుస్తాయి చుట్టరికాలు— నీకు యిష్టం లేకపోతే కనీసం నేనున్నంత కాలమైనా యిలా జరగనీయి—' విసుగ్గా అన్నాడు నరసింహం.

గోపాలం మరిక నోరెత్తలేదు. అప్పుడే కాదు తరువాతకూడా ఎప్పుడూ ఆ విషయం ఎత్తలేదు. అన్నీ చూస్తూ—మింగి వూరుకున్నాడు — తండ్రి అంటే భయం, భక్తి, గౌరవం అన్నీ వున్నాయి కనుక.

చుట్టాలంతా భోజనాలుచేసి పడుకున్న తర్వాత, రాత్రి పదకొండు గంటలకు పడక గదిలో అడుగుపెట్టింది మంజుల.

'నాలుగురోజుల్నించి తిష్టవేసిన అత్తయ్యావాళ్లు యివాళ సాయంత్రం ఊరికి వెళ్లిపోయారు కదా కాస్త తెరిపిగా వుందనుకుంటే—యిదేమిటి మంజూ—మళ్లీ ఈ బెటాలియన్ దిగింది!' అన్నాడు గోపాలం.

అదోరకంగా నవ్వింది మంజుల అతని ప్రక్కనే కూర్చుంటూ.

'నీకేం నవ్వుతావ్ — నేను రాత్రిం బగళ్లూ కష్టపడి సంపాదిస్తున్నది మన యింటికివచ్చే చుట్టాలకే చాలటంలేదు' విసుగ్గా అన్నాడు గోపాలం.

'చెప్పండి — ఏం చేద్దామంటారు?— చుట్టాలను రావద్దని చెబుదామా—మీనాన్న గారిని చుట్టాలను పిలవ్వద్దని చెబుదామా!'

నణుక్కున్నాడు గోపాలం — అసహనంగా, అసహాయంగా.

'ఆ వచ్చిన చుట్టాలూ కావలసిన వాళ్ళే నాయె — పరాయివాళ్ళు కాదుగా' — అన్నది మంజుల.

గోపాలం మండిపడ్డాడు. 'ఆ అంతా కావలసినవాళ్లే— తిని పోవటానికి— పోయిన సారి అమ్మకి ఆరోగ్యం అంత దెబ్బ తిన్నప్పుడు ఎవరు వచ్చారు సహాయానికి — మనకి కష్టాలు వచ్చినప్పుడు ఎవరూ ఆదుకోరేం— తినిపోవటానికే ఈ అక్కరకు రాని చుట్టాలు. అసలు మానాన్నని అనాలి ముందు — ఎందుకు ఆయనకింత బంధు ప్రీతి. మనతాహతూ, స్తోమతూ, ముందూ వెనకా చూడకుండా వచ్చిన వాళ్లని వారాల తరబడి వుండమని బలవంతం చేయటం— వచ్చిన వాళ్లతో మిగతా చుట్టంగాళ్ళ నందర్నీ తీసుకురాలేదని నిష్ఠూరమాడటం— వాళ్ళందరూ వచ్చేదాకా ప్రాణాలుతీయటం— నా ఆరోగ్యం, నా జీతం తరిగి కరిగిపోవటం. మన ఆర్థిక పరిస్థితి దృష్ట్యా మనం పాటించే ఫామిలీ ప్లానింగ్‌కి — ఊళ్లో వాళ్లంతా యిలా మన యింట్లోపడి తింటుంటే—యిక అర్థమేమిటి? అదేదో మన పిల్లలే తింటారులే అనుకుని మనమూ ఒక పదిమందిని కనేద్దాం!' కోపంగా అన్నాడు గోపాలం.

మంజుల గోపాలం జుత్తు నుతారాంగా నిమురుతూ 'వచ్చిన చుట్టాలు తమగొడవ లేదో చూసుకోక—మనకి పిల్లలు పుట్టక పోవటానికి కారణాలు వెతుకుతారేమండీ—' అంటూ జానకి అన్నమాటలు చెప్పింది.

పళ్లుకొరికాడు గోపాలం— 'అంటారు మంజూ—మనం ఊరుకుంటే ఏమయినా చేస్తారు. నేను బెంగుళూరునించి అపురూపంగా తెచ్చుకున్న బొమ్మ — పాతిక రూపాయలది— ముక్కలు చెక్కలు చేశారు. వాళ్ళ పిల్లలా కోతులా—పైగా తనపిల్లలు భలే అల్లరి వాళ్ళని గొప్పలు చెబుతున్నాడు

వాడు ఆలోచిస్తూ నటిస్తున్నాడనుకుంటున్నావు కదూ - కాదురా - మన 'మిస్ కాలేజీ' చెల్లి మనిపించిన చెంప కనిపించ కుండా జాగ్రత్త పడుతున్నాడు!



ఆ పెద్దమనిషి!'

'నెమ్మదిగా మాట్లాడండి — అవతలి వాళ్ళకి వినపడుతుంది!' మందలించింది మంజుల.

'యిలా అయితే యిక లాభంలేదు'— తనలో తానే అనుకున్నట్టుగా పైకి అన్నాడు గోపాలం— మంజుల వడిలో తల పెట్టుకుని—వెచ్చగా పడుకుని.

నెలరోజుల తర్వాత యింటికి వచ్చిన దూరపుచుట్టం కాంతమ్మగారికి బొట్టు పెట్టి కొత్త చీర అందిస్తున్న మంజుల— నాలుగు గంటలకే ఆఫీసునించి వస్తున్న గోపాలంను వింతగా చూసింది.

మంజులనుచూసి హుషారుగా ఈలవేశాడు గోపాలం.

కాంతమ్మగారు సామానుతోసహా బైటికి వెళ్ళగానే— మంజుల గోపాలం గదిలోకి వచ్చింది.

'యిది చూడు మంజూ!' ఒక కాగితం అందించాడు గోపాలం పూర్తిగా చదివిన మంజుల నోటమాట రాలేదు.

'యిదేమిటండీ యిప్పుడు—' అన్నది నెమ్మదిగా.

'యిదా ట్రాన్స్‌ఫర్ ఆర్డర్. ఎక్కడికో తెలుసా మొగల్‌సరాయి— ఉత్తర దేశంలో. దాదాపు వెయ్యి మైళ్ళ దూరం. అంత దూరం ఏ చుట్టాలూ రారు మంజూ— మనం ఆంధ్ర ఆంధ్రా అని ఎన్నాళ్ళ యిక్కడ వుంటాం — నాలుగు దేశాలూ చూద్దాం—నాలుగు రకాల మనుషులతోనూ తిరుగుదాం — ఏమంటావ్!' హుషారుగా అన్నాడు గోపాలం.

మంజుల అన్నది 'నాకేమీ అభ్యంతరం లేదు మీతో రానటానికి — కానీ మీ నాన్న గారూ, అమ్మగారూ యిష్టపడతారా అంత దూరం రావటానికి!'

'అంతా వస్తారు మంజూ—'

'పోనీ ట్రాన్స్‌ఫర్ కాన్సిలేషన్‌కి ప్రయిత్నం చేయరాదూ— అంతదూరం ఎలా వేశారండీ వాళ్ళు — రాలేనని వ్రాయండీ—'

నవ్వాడు గోపాలం 'కాన్సిలేషనా — భలే దానివే—వాళ్ళు ఎందుకో అలా ట్రాన్స్‌ఫర్ చేశారు—వెళ్ళాలిసిందే — మనమిక వద్దన్నా వినరు—'

మొగల్‌సరాయిలో జాయినయిన తర్వాత గోపాలానికి బాగానే వుంది. తల్లీ తండ్రి భార్యతో—వచ్చే జీతంతో హాయిగా ఆనందంగా గడుస్తున్నది—

ఆ రోజు ఆఫీసునుంచి వస్తూ అనుకున్నాడు గోపాలం.

'ఇవాళ మంజులకు చెప్పాలి — తనకి ట్రాన్స్‌ఫర్ దానంతట అది రాలేదనీ —తనే కావాలని ప్రయత్నంచేసి—యింకొక తెలుగు ఆయనతో మ్యూచ్యువల్ ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాననీ'—ఇంట్లో అడుగుపెడుతున్న గోపాలం ఆగిపోయాడు.

'కాశీయాత్రకు బయల్దేరావే సావిత్రీ— ఎలాగూ యిక్కడిదాకా వచ్చాంగదా అని—' ఆ గొంతుతోపాటు— ఎన్నో గొంతులు వినవడుతూ—వింతమంది మాట్లాడుతున్నదీ అర్థం కాకుండా రణగొణ ధ్వనిగావుంది. తన యింటికి ఒక యాత్రా స్పెషల్ రాలేదుగదా అనుకున్నాడు గోపాలం.

మంజుల అతనికి ఎదురువచ్చి 'చుట్టాలొచ్చారు' అన్నది— ●

# భారతీయ చిత్రకారులు

రచన, చిత్రాలు: కాలిపు సోమరాజు

## పద్మశ్రీ హెబ్బార్

వీరి పూర్తి పేరు కృష్ణహెబ్బార్. వీరు దక్షిణ కనరాలో జన్మించారు. ఈ గ్రామం ప్రకృతి సౌందర్యానికి పుట్టినిల్లు. అక్కడ జరిగే ఉత్సవాలు, యాత్రలు, నృత్యాలు, సంస్కృతి-అన్నీ కాంతులీను రంగులతో అతని చిత్రాల్లో సుస్థిరంగా నిలిచిపోయేయి.

వీరి చిత్రాలలో భారతీయ సంస్కృతి ప్రధానంగా ద్యోతకమవుతూంది. బొంబాయి జె. జె. స్కూలులోను, పారిస్‌లోను పాశ్చాత్య శైలిని వీరు అభ్యసించినా తనది అంటూ ఒక ప్రత్యేక శైలిని వీరు సుస్థిరం చేసుకున్నారు. ప్రపంచంలో వీరు చూడని ప్రదేశం లేదు. ఆయా ప్రదేశాల ప్రభావాల్ని తమలో వీరు జీర్ణం చేసుకొన్నారు. అయినప్పటికీ వాటి ప్రభావాన్ని తన చిత్రాలపై పడనివ్వకుండా తన స్వతంత్ర రచనా శైలిని ఉన్నత శిఖరం మీద అధిరోహింపచేసేరు. ఆధునిక చిత్రాలే అయినప్పటికీ వీరివి శుద్ధ భారతీయ చిత్రాలు.

పరమాణుశక్తి యొక్క వినాశక తత్వాన్ని వీరు చక్కగా చిత్రించారు. ఆ చిత్రం ఎన్నో ప్రశంసల్ని అందుకొంది. అయినా నాలుగేళ్ళ తర్వాత మళ్ళీ వీరే ఆ చిత్రాన్ని కొంచెం మార్పు చేసేరు. ఈ నూతన చిత్రం ఆస్ట్రేలియాలో గల అంతర్జాతీయ మ్యూజియంలో ఉంది.

వీరికి ఎన్నో బహుమతులు లభించేయి. భారతప్రభుత్వం ఈ చిత్రకారుణ్ని పద్మశ్రీ బిరుదంతో సత్కరించింది.






### జరిగిన కథ

విద్యార్థి బియ్యే పాసయ్యాడు. తల్లికి పై చదువు మీద ఇష్టం లేదు. అక్కడితో ఆపేసి పెళ్ళి చేసుకుని ఇంటిపట్టున వుండమంది. కాని, విద్యార్థి ఎమ్ఏలో చేరాలని పట్టుపట్టాడు. రైలెక్కి గుంటూరు వచ్చేశాడు. ఎమ్ఏకి ఫీజు కట్టేశాడు. అక్కడే అతని స్నేహితుడు లోకన్‌బాబు కనిపించాడు. తర్వాత మామయ్య గారింటికి వెళ్ళాడు. లక్ష్మి అతని మరదలు. లక్ష్మి అంటే అతనికి ఇష్టమే కాని, తను ఎవరినో ప్రేమిస్తున్నట్టు తెలియ చెప్పింది. విద్యార్థి చాలా విరక్తి చెందాడు. మావయ్యతో ఈ విషయం చెప్పేద్దామనుకున్నాడు గాని చెప్పలేక పోయాడు. తిరిగి గుంటూరు వచ్చేసి వుండడానికి ఒక రూము అద్దెకు తీసుకున్నాడు.

## 4

అప్పటికప్పుడే రిక్షామీద పెట్టె బెడ్డింగ్ గదికి చేరేశాడు...అయితే కొంచెం కొంచెం రంగు వెలిసిన తన ట్రంకు పెట్టె, చిరిగి జీర్ణావస్థలోవున్న ఆ హోల్డాలు; ఆగదికి, గదిలోవున్న ఆనంద్ తాలూకు సామాన్ల ప్రక్కన వుండడానికి అర్హత వున్నవాటిలా కన్పించలేదు విద్యార్థికి...

ఆనంద్ కలవారి గారాబుపట్టి అయ్యుంటాడని, అక్కడవున్న దోమతెర వేసిన మెత్తని పరుపూ—మంచం, ఆ ప్రక్కనున్న ఈజీఛేర్, టేబుల్ మీదున్న ఫానూ, ఆ పక్కగా హిందీ గీతాలను కరువుదీరా వినిపిస్తున్న ట్రాన్సిస్టరు, పక్కనే పెట్టివున్న లెదర్ సూట్‌కేస్...' ఇందుగలడందు లేనట్టుగా పడున్న రకరకాల మాగజైన్స్, వంకెన వేళ్ళాడే టెర్లిన్ బట్టలు అన్నీ కలిపి ముక్తకంఠంతో చాటిచెబుతున్నాయి.

విద్యార్థి మనసు అదోలా అయిపోయింది. అతడు కాలేజి తెరిచిన రోజున మళ్ళీ మూడువందలు 'డ్రా' చేశాడు పుస్తకాలకూ ఖర్చులకూ వుంటుందని...ఇప్పుడు ఆనంద్‌ని చూడగానే అతడికి అర్జంటుగా షాపింగ్ చెయ్యాలనిపించింది. ఇంకేం ఆలోచించకుండా డబ్బు తీసుకుని సత్యం వాళ్ళ గదికి బయలుదేరాడు...సమయానికి సత్యం గదిలో లేడు ... తెలిసిన లెక్చరర్ ఎకనామిక్స్ పుస్తకాలు యిస్తామంటే తెచ్చుకోడానికి వెళ్ళాట్ట ... లోకన్‌బాబు విద్యార్థివెంట వచ్చాడు...

విద్యార్థి ఒక లెదర్ సూట్‌కేస్, ఒక్క కాంప్‌కాట్, ఒక ఈజీఛేర్, గాద్రేజ్ ఫోల్డింగ్ టేబిల్ చిన్నది ఒకటి, ఒక టేబిల్ లైటు, రెండు బెడ్‌షీట్స్ కొనేసరికి అతడి పర్సు తేలికపడింది. హోటల్లో మీల్స్ టికెట్‌బుక్ యింకా కొనలేదన్న విషయం లోకన్‌బాబు జ్ఞాపకం చెయ్యడంతో అదికూడా కొనేసి అప్పటికి సాయంత్రం ఏడు కావడంతో భోజనం ముగించుకొని ఎవరిగదులకు వాళ్ళు చేరకున్నారు. అతడిదగ్గర యిక మిగిలింది పాతిక రూపాయలు...సిటీబస్ కలెక్టరేట్ దగ్గర ఎక్కితే ముప్ఫయి పైసలు...రానూ పోనూ అరవై పైసలు బస్‌కే కావాలి...ఇక కాంటీన్ ఖర్చు...రోజుకు ఎంతలేదన్నా రెండు మూడు రూపాయలు కావాలి... ఆలోచిస్తూ పడుకున్నాడు విద్యార్థి...

మర్నాడు సత్యం పుస్తకాల విషయం జ్ఞాపకం చేశాడు. కాలేజి లైబ్రరీ యింకా తెరవలేదు, కాబట్టి దొరికినంతవరకూ పుస్తకాలు కొనడమే మంచిదని సూచించాడు సత్యం. ఇక మళ్ళీ డబ్బు 'డ్రా' చెయ్యాలి. కానీ బాంకి పది గంటలకుగాని పనిచెయ్యదు. అందుకని ఒకరోజు కాలేజి మానేసి మరో అయిదు వందలుతీసి. ఒక వంద రూపాయలకు పుస్తకాలూ, నాల్గు జతలు టెర్లిన్ బట్టలు, యింకా పాయింటెడ్‌షూ,...ఒక ఫ్లాస్కు అదీ కొని మిగతాది ఖర్చులకు వుంచుకున్నాడు...

ఆ రోజు హోటల్లో మేకుల్లాంటి అన్నం తింటుంటే తల్లి జ్ఞాపకం వచ్చింది విద్యార్థికి...దాంతో యిక్కడికి వచ్చాక ఆవిడకు వుత్తరం వ్రాయలేదన్న విషయం జ్ఞాపకం వచ్చింది. పోనీ తనకు తీరికలేక వ్రాయకపోతే అమ్మయినా వ్రాయచ్చుగా... అనుకున్నాడు...కానీ తనిలా రావడం ఆవిడకు చాలాకోపం తెప్పించిందని తెలుసు...ఆవిడ రాయదు ... తనేరాయాలి ... అనుకుంటూ గదికి వస్తుంటే పట్టు చీరలు కట్టుకొని, చేతిలో సెనగల మూటలతో నెమ్మదిగా నడిచి వెళ్తున్న పేరంటాళ్ళు కన్పించారు... ఈ రోజు శ్రావణ శుక్రవారమన్న సంగతి జ్ఞాపకం వచ్చింది..... దాంతో అతడికి రెండేళ్ళ క్రిందటి సంఘటన జ్ఞాపకం వచ్చింది. . . .

అప్పుడతడు సెకండియర్ బి. ఏ. చదువుతున్నాడు...అది శ్రావణ మాసం... ధనమ్మగారు వరలక్ష్మి వ్రతం ఎప్పుడూ ఘనంగ చేసేవారు. పట్టుచీర క్రొత్త బంగారు నగా ఎప్పుడూ వుండాల్సిందే ... చుట్టుపక్కలవాళ్ళను కూడా భోజనానికి పిల్చేది, కానీ ఆ సంవత్సరం తండ్రిచేతిలో డబ్బు లేక. నలభై యాభై రూపాయల్లో వ్రతం అయిందనిపించ మన్నారాయన. కానీ దాని కావిడ వొప్పుకోలేదు. దాంతో నాలుగురోజులు యింట్లో ప్రచ్ఛన్నయుద్ధం. నాలుగు రోజులు భార్యాభర్తలు మాట్లాడుకోలేదు. చివరికి దేవు వ్రతమనగా ఆవిడకోరినంత డబ్బు ఆవిడ చేతిలో పడేదాకా ఆయింట శాంతి లేకపోయింది.

వ్రతం యధావిధిగా జరిగింది. కాని ఆరోజు ఆఫీసునుండి భోజనానికి కూడా యింటికిరాలేదు ఆయన. రాత్రి భోజనాలప్పుడు ఆ రోజుచేసిన తొమ్మిది రకాల పిండి వంటలూ విస్తట్లో వడ్డిస్తే, ఆ విస్తరికేసి ఒక్కక్షణం చూచి లేచివెళ్ళి చెయ్యి కడుక్కున్నాడాయన. 'నీ పండుగ

పూట ప్రసాదం కూడా ముట్టలేదు. ఏం మనుషులో ఏమిటో...యింట్లో నలుగురూ పప్పుగా 'శుభం' చేసుకుంటే యీయన ఎప్పుడూ యింతే' అని విసుక్కున్నారు ధనమ్మగారు... తండ్రి ప్రసాదం తినక పోవడం విద్యార్థికి కూడా కష్టం కలిగించింది. అమాటే ఆయనతో అంటే తండ్రి యిచ్చిన సమాధానం యిప్పటికీ అతడి చెవుల్లో గింగురు మంటూనే వుంటుంది.

'అది దేముడి ప్రసాదం కాదురా... ఎంతోమంది అమాయకులు తమ నెత్తురు వోడ్చి యిచ్చిన ప్రసాదంరా అది ... పేద వాళ్ళనూ కష్టాల్లోవున్న వాళ్ళనూ పీడించి వసూలుచేసిన డబ్బుతో పూజలూ దానాలూ చేస్తే పుణ్యం వస్తుందిట్రా?. ఏమో నాకు నమ్మకం లేదు. తిరుపతి వెళ్ళి మొక్కు తీర్చుకోవాలని పసిపిల్ల పీకపిసికి సొమ్మపహరిస్తే దేముడు సంతోషిస్తాడా? అసలు దేముడనేవాడే వుంటే, ఆ దేముడికి మనం ఆపాదించే గుణాలన్నీ గనుక వుంటే, కనీసం పొట్టకూటికి కాని పన్ను చేసినా సహిస్తాడేమోగానీ, ... దేముడి పేరుమీద తను గొప్పలు వెళ్ళబోసుకోడానికి చేసే అత్యాచారాన్ని దేముడు ఒక్కనాటికీ సహించడురా ... ఒక్కనాటికీ సహించడు!' అన్నారాయన...

ఆ మాటలు జ్ఞాపకం వచ్చిన విద్యార్థి వులిక్కిపడ్డాడు...అలా అన్న నెలరోజులు తిరక్కుండానే పక్షవాతం వచ్చి ఆయన మంచాన పడ్డాడు ... ఆయన మంచంలో వున్నన్నాళ్ళూ నంగి నంగిగా... 'చేసిన పాపాలు ఎక్కడికి పోతయిరా...ఏదీ ఆ డబ్బుతో మీ అమ్మచేసిన పూజలూ వ్రతాలూ అక్కరకు రావేం?' అని అంటుండే వారాయన.

తండ్రి జ్ఞాపకం రాగానే కళ్ళు చెమ్మర్చాయి విద్యార్థికి. ఆయనే వుంటే తన చదువుకు యిన్ని ప్రతిబంధకాలు వచ్చేవి కావేమో ననిపించింది. ఆరోజు గదికి వెళ్ళగానే ఒక కార్డు వ్రాసి పడేశాడు యింటికి. ఒకవారం పొయ్యాక దానికి జవాబు రాసింది ఆశ. అందులో పెద్ద విశేషాలేమీ లేవు. అప్పటికింకా కాలేజి ఒక్క పూటనే జరుగుతోంది. 'షేక్స్పియరు' పేపర్లో, 'ఎలిజబెతన్ స్టేజీ'కి యింట్రడక్షను' యింకో పేపరులో 'మిల్టన్'కు యింట్రడక్షను జరుగుతోంది. మధ్యాహ్నమంతా విద్యార్థి ఖాళీగానే వుంటున్నాడు. ఆనంద్ బాబుకు కాలేజికి వెళ్ళడమనేది నిత్యంకాదు. అది కేవలం వైకల్పికం. వెళితే వెళతాడు లేకపోతే లేదు. చదవాలి... పాసవాలి ...లాంటి వుద్దేశాలేమీ అతడికి వున్నట్టులేవు, అతడి తండ్రికీ వున్నట్టు లేవు. ఆయనకు కొడుకు మెడికల్ కాలేజిలో చదువుతున్నాడని చెప్పుకోడమే ఒక 'ప్రివిలేజ్'లా వుందేమో ... వీలుంటే జీవితాంతం ఆ 'ప్రివిలేజ్' అలాగే వున్నా వద్దనేట్లు లేడాయన, బోలెడు డబ్బుపోసి కొన్ని 'ఎనాటమీ' పుస్తకాలు, అట్ట పెట్టెలో పెట్టివున్న ఎముకలు, యివన్నీ వదిలేసిన భార్యల్లా దిగులుగా విచారంగా అతడి వైపుచూస్తుంటే 'హవలాక్ ఎలిస్' పుస్తకాల దగ్గరనుండి చవుక బారుసెక్సు సాహిత్యం దాకా అన్నిరకాల పుస్తకాలూ ప్రియురాళ్ళలా అతడి గుండెలమీద, తల పక్క, కాళ్ళదగ్గర. ఎక్కడ చూచినా తామే అయి స్వైర విహారం చేస్తుంటయి... విద్యార్థికి కూడా యివి మంచి కాలక్షేపమైనాయి. బస్స్టాప్ లో కలుసుకోడం తప్ప



సత్యం గదికి వెళ్ళడం కూడా మానేశాడు.

రోజులు గడుస్తున్నాయి. ఆరోజు ఆగస్టు పదిహేను...

అప్పటిదాకా సత్యం గదిలో కూర్చుని వస్తున్న విద్యార్థికి యింటి వాళ్ళింట్లో కుండీల్లో వున్న చేమంతులు స్వాగతం చెబుతున్నట్లు తలూపు తున్నాయి... గులాబులు మత్తుగా నవ్వుతున్నాయి... సాయంత్రం ఆరుగంటలవేళ' ఆకాశాన్ని మొత్తాన్ని కబళించాలని కాబోలు శ్రావణ మేఘాలు వలుమూలలా కమ్ముకుంటు న్నాయి...

మెట్లెక్కుతున్న విద్యార్థికి తమ గదిలో గాజుల గలగలలు విన్పించాయి. దాంతోటే నవ్వుల కిలకిలలు కూడా విన వచ్చాయి. ఆశ్చర్యంతో గుమ్మం దగ్గరే ఆగిపోయ్యాడు విద్యార్థి, గదిలో వున్న ఆ యిద్దరి యువతుల్నిచూసి సందేహిస్తూ... బూట్ల టకటకలు విని తిరిగి చూచిన ఆనంద్, తటపటా యిస్తున్న విద్యార్థిని చూచి, 'రావోయి రా... మనవాళ్ళేలే... ఫర్వాలేదు.' అన్నాడు నవ్వుతూ.

ఆనంద్ తన పడక్కుర్చీలో కూర్చు న్నాడు. అతడి కాళ్ళకు తనకాళ్ళు తగిలేంత దగ్గరలో అతడి మంచం మీద కాళ్ళూపుతూ కూర్చుంది మోహనాంగి. వాళ్ళిద్దరికి కొంచెం విడంగా విద్యార్థి పడక్కుర్చీలో కూర్చునున్నది మరో సుందరాంగి...

బిడియపడుతూనే లోపలికడుగు పెట్టాడు విద్యార్థి.

'మా రూమ్మేట్ విద్యార్థి... పి. జి. సెంటరులో ఎం. ఏ. ప్రీవియస్ చదువు తున్నాడు.' అంటూ పరిచయం చేశాడు ఆనంద్...

ఆనంద్ మంచంమీద కూర్చున్న మోహ నాంగి అలవోకగా ఒక నవ్వునవ్వి సుతారంగా చేతులు జోడించింది.

'మోహిని...నా క్లాస్‌మేట్.'

నమస్కరించాడు విద్యార్థి...

'ఈమె సుందరి... మోహిని రూమ్మేట్ మా కాలేజీయే ... సెకండియర్...' వాలు కుర్చీలోంచి లేచీ లేకుండా వయ్యారంగా చేతులు జోడించింది సుందరి. ఆ కదలిక ఏదో నాట్య భంగిమను జ్ఞప్తికి తెచ్చింది విద్యార్థికి. ప్రతి నమస్కారం చెయ్యడం



కూడా మర్చిపోయి అప్రతిభుడై నిలబడ విద్యార్థిని చూచి,

'కూర్చోవోయి ... నీ మంచం మీద కూర్చో.' అంటూ సూచించాడు ఆనంద్.

'మీ కుర్చీమీద నేను దురాక్రమణ జరిపాను.' మత్తు చల్లినట్లు నవ్వుతూ అన్నది సుందరి...

'ఆఁ...ఆఁ..ఫ..ఫర్వేదు...' తడబడే మాటలతో, తడబడే అడుగులతో, అంత కంటె తడబడుతున్న గుండెలతో మంచం మీద కూర్చున్నాడు విద్యార్థి ... అలా కూర్చునేటప్పుడు మంచం కుర్చీకి యింకొంచెం ఎడంగా జరుపుకు కూర్చుంటే బాగుండునని సూచించింది అతడి అంత రాత్మ...అలా చెయ్యడం సభ్యతకాదేమోనని వారించింది అతడి బుద్ధి.... ఆనంద్ మోహినీ కూర్చున్నట్లు యింకొంచెం దగ్గ రికి జరుపుకొని కూర్చోకూడదూ చక్కగా..

## దీపాలకు ప్రతిరూపాలు

ఎవరమ్మా ఎవరు మీరు
పువ్వుల వలే నవ్వుతారు
ఎవరమ్మా ఎవరు మీరు
దీపాలకు ప్రతిరూపులు—

ఎడదలోని మూగబాస
గుర్తెరిగిన పరమాత్ములు
కనుసన్నల శాంతి సుధలు
చిలికించే పావురాలు—

కొండలపై ఉదయించే
చందురుడా బుల్లిమామ
ఊయలూపి జోల పాడు
తెలుగు ఎంకి మీతల్లా?

తాతయ్యలు మీకు మంచి
తేటతెనుగు కదలుచెప్పి
మామయ్యలు మీకు మంచి
కాయిల్లాలు సంచిపెట్టు—

ఎవరమ్మా ఎవరు మీరు
కష్టులను ఊరించుతారు
ఎవరమ్మా ఎవరు మీరు
దవ్వులై వెలుగొందుతారు..

—వడావి సత్యనారాయణమూర్తి

అంటూ గునుస్తోంది మనసు...

సభ్యతకోసం మంచానికి చివరే కూర్చున్నా; ఆ వాతావరణంలో ఫ్రీగా యిమడలేక తలవంచుకున్నా, అతడి చూపు మాత్రం, ఆకు పచ్చని చీర కుచ్చెళ్ళలోంచి తొంగి చూస్తున్న సుందరి పచ్చని పాదాల మీదనేవుంది.

అంతదాకా నవ్వులతో గలగలలాడిన గది విద్యార్థి రాకతో కొంచెం లేని గంభీరత తెచ్చుకున్నట్లుంది.. నిశ్శబ్దంగావున్న ఆవాతా వరణంలో

'ఏం గురూ...ఫంక్షను బాగా జరిగిందా మీ కాలేజీలో?...' అని అడిగాడు ఆనంద్...

'ఏం ఫంక్షనోనండి...ఎవరికీ వుత్సాహంగా లేదు.' అంటూ నాన్చేశాడు విద్యార్థి.

'ఏం ఎందుకని?'

'మా ప్రిన్సిపాల్‌గారికి గుండె నొప్పి వచ్చింది. ఆయన రాలేదు. వచ్చినవాళ్ళ వుత్సాహంకూడా నీరు కారిపోయింది. ఏదో జరిగింది....అంతే...'

'అయితే మధ్యాహ్నమంతా ఏం చేస్తు న్నావోయ్?'

'చార్లోజాలైందని సత్యం వాళ్ళగదికి లాక్కెళ్ళాడు...ఇప్పటిదాకా అక్కడే కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం.'

'మధ్యాహ్నంనుంచీ ఎంత ఎంజాయ్ చేశామో మేము...బాడ్‌లక్...ఇప్పుడే పేక కట్టేశాం.' అన్నాడు ఆనంద్...

'పోనీ మరో ఆటవేద్దామా?' అన్నది సుందరి.

'ఓ...నో...పిక్చర్ ప్రోగ్రాం వుందిగా... అన్నట్లు గురూ....నువ్వుకూడా రావాలి పిక్చరుకు...పాపం మా సుందరి మధ్యాహ్నం నుంచీ కంపెనీలేక బాధపడుతోంది.' నవ్వుతూ అన్నాడు ఆనంద్....

బాబోయి....వీళ్ళమధ్య నేనెందుకు?... రానని చెబుదామనిపించింది విద్యార్థికి. అసలు చిన్నప్పటినుంచీ మెడికోలంటే అతడికో విధమైన భయం....అది యిన్‌ఫీరి యారిటీ కాంప్లెక్స్‌వల్లకాని మరెందువల్లా కాని వాళ్ళకు కొంచెం దూరంగా నే వుంటుంటాడు...'నేను చదువు పడుకోవాలి. మీరు వెళ్ళండ'ని చెబుదామనే వుద్దేశంతో తలఎత్తితే సుందరి ఎంతో ఆశతో తన వైపు చూస్తూ కన్పించింది. అందంకంటె మించిన ఆకర్షణవున్న ఆ కళ్ళల్లో

# నా ముందుచూపు సమయానికి ఆదుకుంది.




మీ పొరుగింటివారు వచ్చినప్పుడు ప్రేమతో ఒక కప్పు కాఫీ లేక టీ ఇస్తారుకదా! దానితోపాటు బ్రిటానియా మారి బిస్కట్లుకూడా ఇవ్వండి. మీ ఆతిథ్యానికి వారు ఉప్పొంగిపోతారు. బ్రిటానియా మారి గరగరలాడే, శ్రేష్ఠమైన బిస్కట్లు.

**బ్రిటానియా మారి గరగరలాడుతూండడానికి కారణం?**

80 ఏండ్ల నిరంతర అనుభవంలో బ్రిటానియావారు అత్యాధునికమైన పద్ధతులు కనుగొన్నారు. అందుకే మారి బిస్కట్లు గరగరలాడుతూ వుంటాయి.

**బ్రిటానియా మారి శ్రేష్ఠతకు కారణం?**

జాగ్రత్తగా పరీక్షించండి. ప్రతి బిస్కట్టుమీదా మిలమిలలాడుతూన్న పైపూతను గమనించండి. అదే బ్రిటానియా మారి తయారీలోని విశిష్టత

**బ్రిటానియా మారి అధిక రుచికి కారణం?**

బ్రిటానియా వారికి మాత్రమే బిస్కట్ల తయారీలో ఉపయోగించే ప్రత్యేక పదార్థాల కలయికల రహస్యం తెలుసు. పైగా నాజూకైన సువాసనతో మిళితమైనప్పుడు ఆ పదార్థాల రుచి అధికమవుతుంది.

# బ్రిటానియా మారి బిస్కట్లు

భారతదేశంలో అతి శ్రేష్ఠమైన బిస్కట్లు బ్రిటానియా

వస్తావుగా అన్న అభ్యర్థననూసి రానని చెప్పలేక పొయ్యాడు విద్యార్థి...అలసటగా వున్నా బయలుదేరాడు...

అప్పటికే ఆరున్నర దాటింది...చీకట్లు చిక్కబడుతున్నాయి ..ఆ చీకట్లో మెర్క్యురీ దీపాలు ప్రేమికులపాలిటి శాపాల్లా వెలుగు తున్నాయి.

వీధిలో జనం అంత రద్దీగా లేకపోయినా, పూర్తిగా పలచబడిపోనుమాత్రం లేదు... ఒకళ్ళిద్దరు తిరుగుతూనే వున్నారు.

ఒకరికి దూరంగా ఒకరం వుండలే మన్నంత దగ్గరయిపోయి నడుస్తున్నారు ఆనంద్ మోహినీలు ... వాళ్ళకు ఒకగజం వెనకగా నడుస్తోంది సుందరి ... సుందరి పక్కన నడవక తప్పలేదు విద్యార్థికి.

ఊళ్ళో చాలచోట్ల ఫంక్షన్స్ జరుగు తున్నాయి...సందు చివర ఆగారు మోహిని ఆనంద్‌లు...

'ఇప్పటికే పిక్చర్ 'బిగిన్' చేసివుంటా రేమో...రిక్షా చేసుకుందామా?' అన్నాడు ఆనంద్...

'ఇంక నడవలేం బాబూ...' అంది సుకుమారంగా మోహిని...

రిక్షాలు రెండే వున్నయ్యే ... సర్లే... మనిద్దరం యిందులో ఎక్కుదాం.. వాళ్ళు దాంట్లో వస్తారు...' అంటూ మోహిని ఆనంద్‌లు ఒకరిక్షాలో ఎక్కారు. సుందరి

# విద్యార్థి

రెండోదాంట్లో ఎక్కింది ... కొంచెం తట పటాయిస్తూ నిలబడ్డాడు విద్యార్థి ..

'చాలేవోయి బుష్యశృంగా!...ఎక్కెక్కు. అవతల టైము పోతోంది.' ఎగతాళిగా అన్నాడు ఆనంద్...

రోషమొచ్చింది విద్యార్థికి ... ఛప్పన ఎక్కేడేగానీ...యిదెక్కడి గొడవరా బాబూ.. యిదేమన్నా మహానగరమా? ... ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు? ... అను కున్నాడు ... ఈ దీపాలన్నీ ఆరిపోయి ... ఎవ్వరూ చూడకుండా హాలు చేరుకుంటే బాగుండు ననిపించింది ...

సుందర్ని చూడగానే జయలక్ష్మి జ్ఞాపకం వచ్చింది విద్యార్థికి...ఇద్దరూ అందగత్తెలే కాని యిద్దరి అందంలోనూ తేడా వుంది. జయలక్ష్మి అందం మనసుకు హాయి హాయి మనిపించే అందం...సుందరిది మనసునిలు వనియ్యని అందం...లక్ష్మిలో అందం వుంటే సుందరిలో అందాన్ని మించిన ఆకర్షణ వుంది...

చెయ్యి జారిపోయ్యిన లక్ష్మిని తల్చు కుంటుంటే చేతికందిన యీ అవకాశాన్ని చేతులారా జారవిడుచుకుంటున్నానా అనిపిం చింది.విద్యార్థికి ... అప్పటిదాకా ఇబ్బందిగా సర్దుకు కూర్చున్న విద్యార్థి వెంటనే జరిగి హాయిగా కూర్చున్నాడు ... సుందరి వెచ్చని స్పర్శ క్రొత్త అనుభూతిని కలిగిస్తోంద తనిలో ... అతడ్ని తాకుతున్న శరీరంలోని వంపు సొంపులు అతడు సెక్స్ నాగ జైన్స్‌లో చదివిన అనుభవాలను గుర్తు తెస్తున్నాయి ... నరాల్లో విద్యుత్తు ప్రవహించటం మొదలు పెట్టింది.

ఇంతలోకే థియేటర్ వచ్చింది. రిక్షా దిగాల్సి వచ్చినప్పుడు మాత్రం ... అరె!... అప్పుడే దిగాలా అనిపించిందతడికి...

రెండు రిక్షాలకు డబ్బులు ఆనంద్ యిచ్చేశాడు... అతడే టిక్కెట్లు కూడా కొని తెచ్చాడు...అప్పటికే సినిమా మొద లెట్టారు ... గేట్‌మాన్ టార్చివేస్తూ తీసికెళ్ళి ఒక వరుసలో రెండు సీట్లు చూపించినప్పుడు మోహిని ఆనంద్‌లు వెళ్ళి కూర్చున్నారు ... ఇంకో వరుసలో రెండు సీట్లు చూపించినప్పుడు 'రండి' అంటూ ముందుకు నడిచింది సుందరి...

రిక్షాలో అనుభవం వయసులోవున్న అతడి రక్తాన్ని వేడెక్కించగా, అతి చనువు తీసుకుంటే ఆవిడేమనుకుంటుందోనన్న భయ మున్నా, చేతికందిన అవకాశాన్ని జారవిడు చుకో దల్చలేదు విద్యార్థి...సినిమా జరుగు తుండగా అతడి చెయ్యి తనచేతిమీద పడ్డప్పుడు వారించకపోగా సుందరి ప్రోత్స హించడం అతడికి మరింత చనువిచ్చింది.. సినిమా అవగానే ఆనంద్‌కోసం వెతుకు తున్న విద్యార్థి చెయ్యి మృదువుగా నొక్కి, 'వాళ్ళు వెళ్ళిపోయినట్టున్నారు... మనం వెళదాంరండి...నాకు తోడొస్తారుగా మీరు?' అంది కళ్ళల్లోకి చూస్తూ గోముగా...

'ఓ తప్పకుండా...' అంటూ తనే యిద్దరికీ కలిపి ఒక రిక్షాయే మాట్లా డాడు...

రిక్షా సుందరి యింటివైపు వెళ్తుంటే.. అతడి శరీరం సుందరి శరీరాన్ని తాకుతుంటే అతడి రక్తం వేడెక్కి కొంపరదేస్తోంది... అయితే ఏవేవో ఆలోచనలు కూడా ముసురు కొన్నాయి అతడిలో...

రిక్షా దిగుతున్నప్పుడు అంది సుందరి, 'మా యింట్లోకి రండి' అని...

విద్యార్థి కొంచెం జంకి, 'అహా... యిప్పుడు కాదులెండి...మరోసారి.' అన్నాడు.

'ఏం మాయింట్లోకొస్తే ఎవరైనా తిం టారా?' కళ్ళతోనే నవ్వుతూ అంది..



'అహాఁ...నేనుకాదు...మీరు అపరిచితం అయిపోతారేమోనని' అంటూనే లోపలి కొచ్చాడు...

'ఇంతదూరం తోడువచ్చినందుకు చాలా థాంక్స్.' అంది పంచలో కుర్చీ చూపిస్తూ...

'మీ థాంక్స్ వుత్తమాటల్తో వెళితే చాలదండోయ్...యింతదూరం పిల్చుకొచ్చి సైగతో...లోపలికి రమ్మని బలవంతం చేశారు...మీ కృతజ్ఞతమీద టాక్సుపడు తుంది' వ్యంగ్యంగా అన్నాడు మెల్లిగా...

'పాపం ఆనంద్ సమ్మర్లి అమాయకు డంటాడు...ఏమో అనుకున్నాను చాలా గడుసు వాళ్ళే...మీ యిష్టం ఏం టాక్సు వసూలు చేస్తారో?...?' కొంటెగా ఆహ్వానిస్తుంది సుందరి కవ్వించే చూపుల్తో...

'ఇదీ టాక్స్...' అంటూ అమాంతం వెళ్ళి తన బాహువుల్తో సుందరిని చుట్టేసి ముద్దు పెట్టుకున్నాడు...

'ఎవరవే?...సుందరమ్మా?..ఎవరూ?...' అంతదాకా వంటయింట్లో కునుకు తీస్తున్న మామ్మగారి పలకరింపుకో దూరంగా జరిగి నిలబడ్డాడు విద్యార్థి...

'నేనే లెండి మామ్మగారూ..'

'ఎవరితోనమ్మా మాట్లాడుతున్నావ్?.. మా మోహినమ్మకూడా వచ్చిందా?....'

వంటింట్లోంచి ఆ ముసలి శాల్తీ కదులు తున్నట్లు అలికిడయ్యె. విద్యార్థిని పంచ దిగమని సైగచేసి, 'మోహినికూడా వచ్చే స్తోందండి...నేనూ యింకో స్నేహితురాలూ ఒకరిక్షాలో వచ్చాం ..వాళ్ళ రిక్షా కొంచెం వెనకబడింది...మీరు చీకట్లోకి ఏమొస్తారు నేను చూస్తానుండండి బయట రిక్షా వస్తున్నదేమో...' అంటూ ఆవిడను హాల్లోనే ఆపేసి తను బయటికొచ్చింది...

విద్యార్థికి చాలాకోప మొచ్చింది. ఈ ముసలమ్మ పీడపిసికి, అందబోతున్న మధు పాత్ర అందుకోవాలని పించింది. కానీ పాపం నిస్సహాయుడు...

'ఇప్పుడే మా స్నేహితురాల్ని పంపి, మోహిని వస్తున్నదేమో' చూసివస్తా'నని బయటకొచ్చిన సుందరి చెయిపుచ్చుకుని దీనంగా, 'పునర్దర్శనం?' అని అడిగాడు విద్యార్థి...

'రేపు చీకటి పడ్డాక...బంగళాల రోడ్డు దగ్గర...' మెల్లిగా చెప్పింది.

మెట్లదగ్గర చీకట్లో వీడ్కోలుగా చెయ్యూపొక్కన సుందరిని గాఢంగా ముద్దు పెట్టుకొంటున్న విద్యార్థి ముసలమ్మ పంచలో కొస్తున్న అలికిడి విని మెల్లిగా జారుకున్నాడు...

మర్నాడు కాలేజికి వెళ్ళే సిటీ బస్ క్రిక్కిరిసి వుంది. భుజాలుదాటని పొట్టి చమికెల అమ్మాయిల ప్రక్కన నిల బడ్డప్పుడు. భుజానుండనని పేచీపెట్టే బెత్తెడు పమిటతో కవ్వించే సుందరి జ్ఞాపకం వచ్చింది.అతడి నరాలు వేడెక్కాయి. క్లాసులో లెక్చరర్ 'ఎలిజబెతన్ స్టేజీ'ని గురించి చెప్పాడో, ట్వెంటియెత్ సెంచరీ డ్రామా గురించి చెప్పాడో విద్యార్థికేమీ అంతుబట్టలేదు. ఆయనేమో 'ఆడియన్సు' అంటున్నారు. 'స్టేజి కార్టెన్' అంటున్నారు. విద్యార్థికి వినిపించింది సుందరి అన్నపేరు. మనోనేత్రం ముందు కనిపిస్తున్నది ఫ్రంట్ కర్టెన్ లేని ఎలిజబెతన్ స్టేజికాదు, ఆకుపచ్చ నైలెక్సు చీరలో, ఆకుపచ్చని రాళ్ళ జూకాలతో, ఆకుపచ్చని గాజాలతో, పచ్చని జెండాలా, తన కోరికల రైలుకు పచ్చజెండా వూపుతున్న సుందరి రూపం...

ఆ సాయంత్రం అన్న ప్రకారం సుందరి వస్తుందా రాదా అని అనుమానిస్తూ, నిర్ణీత ప్రదేశం చేరుకున్న విద్యార్థికి జంకు పూర్తిగా పోలేదుకానీ, అన్నమాట ప్రకారం వచ్చిన సుందరిని చూడగానే వుడుకు రక్తం నిలవ నివ్వలేదు.

రాత్రి బాగా చీకటిపడ్డాక యింటిదగ్గర దింపి వస్తున్న విద్యార్థికి...

'ఏమ్మాయింత చీకటి పడిందీ?' అని ముసలమ్మగారు అడగడం, 'మా హాస్టలుకు వెళ్తున్నానని చెప్పానుకదండీ...నేనూ తనూ కలిసి చదువుకుందా మనుకున్నాం లెండి' అని సుందరి జవాబు చెప్పడం వినిపించింది...

(ఇంకా ఉంది)

# వారఫలం

**4-8-1972 శుక్రవారం మొదలు**

**10-8-1972 గురువారం వరకు**

**మేషం:** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది వారం ఆఖరులో సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృషభం:** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కర్కాటకం:** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో అధికవ్యయం జరుగుతుంది. ప్రయాణాల్లో ప్రయాస కలుగుతుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. విలాస వస్తువులు కొంటారు.

**సింహం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులనుకల్సుకొంటారు. నూతన వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారంఆఖరులో ప్రయోజనం లేని శ్రమకు గురికాగలరు.

స్త్రీలకు— దైవకార్యాలు నెరవేరతాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**కన్య:** అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వృత్తివ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— అలంకార వస్తువులు కొంటారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**తుల:** మీతాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీకంటే పెద్దవారు కూడా కొన్ని వ్యవహారాల్లో మీ సహకారాన్ని కోరవలసివస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృశ్చికం:** రావలసినడబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో ఆందోళనకలుగుతుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి కి ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**ధనుస్సు:** వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. పోటీ వారితో వాద ప్రతివాదాలు తగవు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారంఆఖరులో ఆకస్మికంగా వ్యతిరేక పరిస్థితి యేర్పడుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరాల కోసం వ్యయం చేస్తారు.

**మకరం:** వృత్తిలో నూతనావకాశాలు లాభిస్తాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వారం ఆఖరులో మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**కుంభం:** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీకు అనవసరమైన సందేహాలు కలుగుతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మీనం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

—మహేష్


కార్టూన్లు
కార్టూన్లు
కార్టూన్లు
కార్టూన్లు


హుష్ కాకి!
నీకథ కాకెత్తికెళ్లిందమ్మా!
నచ్చకపోతే
తిరిగి యిచ్చెయ్యండి!
అలా అనడ
మెందుకు!
ఎడిటర్
బాలలోకం మాసపత్రిక


నిజంగానే కన్పించడం లేదు -
అబ్బులూ!
కనపడుటలేదు


మీరు కుక్కల్ని పిల్లుల్ని ఇంట్లో తాళం పెట్టి బాధపెడుతుంటారని — మీ చుట్టుపక్కలవాళ్ళు రిపోర్టు చేసేరు. మీరు అలాంటి అల్లర్లు ఇంక మానేయాలి మరి




కుక్క
ఉన్నది
జాగ్రత్త


ఓ పది పైసలుంటే
అప్పివ్వు గురూ!!


సైకిల్ మీద వెళ్తూ నాకు రెండు
చేతులెత్తి నమస్కారం
చెయ్యకపోతేనేం?


మేనేజర్:
బుద్ధ
శాంతమూర్తి






నా స్వీయ చరిత్ర ఇంత గొప్పగా చిత్రించి
రాసి ఇచ్చినందుకు నీకెలా కృతజ్ఞత చెప్పు
కోవాలో తెలీడం లేదు!




మందనిజెప్పి చేదు విషం నోట్లోబోసి
రెండు రూపాయలిమ్మంటావా? మా ఆవిడే నయంగదయ్యా
కాఫీ ఇచ్చినప్పుడు
డబ్బేం అడగదసలు!



# సికిల్ సెల్ అనేమియా

## — పి. రమేష్ నారాయణ —

సమాజంలోని వ్యక్తులు బలయ్యే దారుణమయిన వ్యాధుల్లో సికిల్ సెల్ అనేమియా ఒకటి. మన రక్తంలోని ఎర్ర రక్తకణాలకు సంబంధించిన ఈ వ్యాధి హీమోగ్లోబిన్ అణురచనా స్వరూపంలోని పాలీ పెప్టయిడ్ వరుసలో ఒక అమినో అమ్లం సరయిన స్థానంలో లేకపోవటంవల్ల వస్తుందని ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు, నోబెల్ బహుమతి గ్రహీతా అయిన డాక్టర్ లైనస్ పాలింగ్ అభిప్రాయం. తొలి సారిగ ఆఫ్రికావాసుల్లో గుర్తించబడ్డదీ, సాధారణంగా మలేరియా అధికంగా వ్యాపించిన ప్రాంతాల్లో వ్యక్తమయ్యేదీ అగు ఈ భయంకర రోగం వంశపారంపర్యంగా సంక్రమించే లక్షణాన్ని కలిగివుంది.

సామాన్యంగా మన ఎర్ర రక్తకణాలు గుండ్రంగనో, అండాకారంలోనో వుంటాయి. నిజానికి ఆకారం వీటిలో జన్యువులవల్ల నిర్ణీతమై వుంటుంది. వీటి అకారాన్నిలా నిర్ణయించే జన్యువులు 'A'—'A' అని రెండు వుంటాయి. కానీ ఈవ్యాధి గల వ్యక్తుల్లో ఈ రెండింటిలో ఒకటి అసాధారణంగ వుంటుంది. దీన్ని 'S' జన్యువు అంటారు. దీనివల్లే ఎర్ర కణాల నిర్మాణంలో మార్పు సంభవించి అవి ముక్కలు ముక్కలుగా, అర్ధ చంద్రాకారం వ్యక్తపరుస్తాయి. ఇదే సికిల్ సెల్ అనేమియా లక్షణం.

ఈ రోగుల్లో ఎర్ర రక్తకణాలు తమ ఆకార నిర్మాణాల్లో లోపం కలిగి అక్సిజన్ సరిగ గ్రహించ లేకపోవటంవల్ల అకాలమరణం సంభవించే ప్రమాదం వుంది. కానీ విచిత్రకరంగా మలేరియా వ్యాధి అధికంగా వ్యాపించిన ప్రాంతాలో గల ఈ రోగులపై మలేరియా ప్రభావం చాల తక్కువగ వుంటుందని గుర్తించబడింది. అంతేగాక ఈ వ్యాధిగల స్త్రీల సంతానం మామూలు వ్యక్తుల సంతానం కంటే మలేరియా రోగ నిరోధకతను అధికంగా వ్యక్తపరచటం కూడా గమనించబడ్డది.

మలేరియా ఎక్కువగ వుండే ప్రాంతాల్లోనే ఈ రోగులు అధిక సంఖ్యలో వుంటారు. దీనికి ముఖ్య కారణం వీరు అధిక సంతానాన్ని కలిగించే సామర్ధ్యం కలిగివుండటమే నన్న అభిప్రాయం ఇద్దరు అమెరికన్ శాస్త్రజ్ఞులచే గత సంవత్సరం వెల్లడించబడింది. వాషింగ్టన్ యూనివర్సిటీకి సంబంధించిన ఇద్దరు వైద్య శాస్త్రజ్ఞులు జె. డబ్లుయు. ఈటన్ మరియు జె ఐ మూచాలు ఈ అభిప్రాయాన్ని 1971 జూన్ నెలలో 'నేచర్' అన్న పాశ్చాత్య పత్రికయందు వెలిబుచ్చారు. అంతేగాక కృతకంగా శరీర వుష్ణోగ్రతను 37° సెంటిగ్రేడునకు హెచ్చించటం ద్వారా పురుష బీజాల వుత్పత్తిలో సంభవించే మార్పుల ఫలితంగా ఈ రోగుల సంతానాన్ని తగ్గించే అవకాశాలున్నాయని వీరి పరిశోధనలు ధృవీకరించాయి.

సికిల్ సెల్ అనేమియా ఆసియా ఖండ వాసుల్లో చెదురుగ న్నా, ఆఫ్రికా ఖండంలో నలభై శాతము, మధ్యధరా సముద్ర ప్రాంతంలోని సార్డీనియా ద్వీపంలో సగానికి పైగా ప్రజలు ఈ వ్యాధిపీడితులు. దీనిపై గావించిన సర్వేల ఆధారంగా ఈ రోగుల సంతానంలో వ్యాధి కారకమయిన 'S' జన్యువు ఒకటే మున్న ఎడల వారు మలేరియా రోగ నిరోధకతను హెచ్చుగ కలిగివుంటారని తేలింది. కానీ రెండు 'S' జన్యువులుంటే శిశువులు బాల్యావస్థ కూడా గడవక ముందే మరణిస్తారట.

ఈ మధ్యకాలంలో అమెరికా, ఇటలీలలో ఇలాంటి జన్యవ్యాధుల వునికి గూర్చి బడిపిల్లల్లో విధిగ స్క్రీనింగ్ చేస్తూ భవిష్యత్తులో వారి జీవన విధానాలు, వివాహ ప్రయత్నాల్లో తీసుకోవలసిన జాగ్రత్తలను గూర్చి ప్రత్యేకంగా వివరిస్తున్నారు.

జన్య శాస్త్రంలో ప్రస్తుతం కొనసాగే నవీన పరిశోధనలు పూర్తి ఫలవంతాలయితే 'జెనిటిక్ ఇంజనీరింగ్' ద్వారా యిలాంటి అనువంశిక వ్యాధులను నివారించుకొనే శుభదినం చాల దగ్గరలోనే వుందని న్యూఢిల్లీలోని ఆలిండియా ఇన్స్‌టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ జీవరసాయన విభాగపు అధిపతి ప్రొఫెసర్ తల్వార్ గారి విశ్వాసం.





1972కి స్విట్జర్లాండ్ సుందరిగా ఎన్నికైన డయానీగుబ్లెర్

# మంత్రిగారొస్తారు!



తొందరగా తల్దువ్వవే అమ్మా... లేటైపోతోంది'

'ఏవిటా గెంతులూ ...అబ్బబ్బ...తలకి నూనె రాయమంటావా—వద్దా? ఏవిట్రా ఇవాళ అంత తొందర?'

'తొందరంటే తొందరే మరి...మాకు మిఠాయిలు పంచిపెడతారు. అల్లా ఆఫీసుకి మంత్రిగారొస్తారు. మరి మా స్కూలు పిల్లలవంతా వెళ్ళొద్దేవిటమ్మా'

'మంత్రిగారికోసమా— మిఠాయిలకోసమా ఈ విందులన్నీ? ఊ...మరి తల అలా అల్లలాడిస్తే ఎలా దువ్వను? ఇంకా ఏదీ రాజా, వీరభద్రం రానేలేదు. కాస్త ఉప్మా తిని వెళ్ళు...'

గోపీ వినిపించుకుంటేనా? చొక్కా మీద గుండీ పెట్టుకోలేదు. పాలేనా తాగలేదు. నిన్న బాగా కరిచిందన్న జోడు గురించి ఆలోచించనేలేదు. ఆదరా బాదరా తొడిగేసుకుని, పుస్తకాల సంచీ భుజాన తగిలించుకుని, వెనక్కి తిరిగేనా చూడకుండా పరుగుచ్చుకున్నాడు.

- శాంత మనసు చిన్న బుచ్చుకుంది. ఏడేళ్ళ పసివెదవలో ఇంత ఉత్సాహమూ మంత్రిగారికోసమేనా? ఏవీ తినకుండా, తాగకుండా వెళ్ళినవాడు ఎప్పటికి వస్తాడో అన్నదే ఆమె ఆలోచనైపోయింది,

'గోపీ...హేయ్...గోపీ' అని పిలిచి, ఎదురుగా కనపడ్డ శాంతతో 'గోపీ వున్నాడాండీ' అని అడిగాడు, తానూ ఓ దేశనాయకుళ్ళా లాల్చీ, పైజమా వేసుకుని బయల్దేరిన వీరభద్రం.

'ఇప్పుడే వెళ్ళిపోయాడు. ఇంకా మలుపు తిరిగుంటాడేమో?' అప్పుడుగాని ... మంత్రి

గారు ఏన్నింటికి వస్తారట?' అడిగింది శాంత.

'ఏమో నాకేం తెల్సు? మా మాష్టారు చెప్పారు నిన్న—మంత్రిగారొస్తారు. తెల్లారేసరికి అందరూ వచ్చేసేయండి. మీరంతా వీధుల్లో నిల్చోవాలి. జై జై అనాలి—అని. అందుకే తొందరగా వెళిపోతున్నాం—' అంటూ గబగబా నడిచిపోయాడు.

వీధిలో నిల్చొని చూస్తోంది శాంత. నిజమే. ఎప్పుడూ ఏడుస్తూనో అని వుండే ఊరు, ఆవేళ కళకళలాడుతున్నట్టనిపించింది. మనుషులు చాలా హడావిడిగా తిరుగుతున్నారు. ఎప్పుడూ లేంది, తమ ఇంటి ముందునుండి రెండుమూడు జీపులుకూడా వెళ్ళాయి.

హైస్కూలు పిల్లలు, ఎన్సీసీ బట్టలు వేసుకుని, బూట్లు టకటక లాడిస్తూ తీవిగా నడిచిపోతున్నారు. వీధికొసన ఏదో అలంకరిస్తున్నారు కూడా.

ఇంతకీ మంత్రిగారొచ్చేది ఎన్నిగంటలకు అన్నది తెలుసుకుందామన్నది ఆమె తాపత్రయం.

ఇంతలో రాజు అలా వెళ్ళడం గమనించి, పిలిచి అడిగింది.

'తొమ్మిదికి అనుకుంటాను' అన్నాడు రాజు.

'ఇవాళ స్కూలు లేదా?'

'మంత్రిగారొస్తే, స్కూలుంటుందేమిటి? అందుకే మేం పుస్తకాలు పట్టు

# మంత్రిగారొస్తారు !

కెళ్ళ్తున్నవేమిటి?' ఎదురు ప్రశ్న వేశాడు.

'మంత్రిగారొస్తే స్కూలుండదు ఆ రోజు పాఠాలు సున్నా. బాగానే వుంది. ఐతే, గోపి పుస్తకాలు తీసుకెళ్ళాడేం చెప్మా?' తనలో అనుకున్నట్టు అంది శాంత.

'ఏమో...నే వెళిపోతున్నా' దౌడు తీశాడు రాజు.

ఎండాకాలమేమో, ఉదయం ఆరున్నరకే ఎండ తీక్షణంగా వచ్చేసింది. చెమటలు పట్టేస్తున్నాయి.

'ఏం చోద్యమమ్మా...ఎప్పుడో తొమ్మిదింటికి మంత్రిగారొస్తే, పిల్లవెధవ వచ్చి మంచినీళ్ళైనా తాక్కుండా తెల్లారేసరికి తుర్రుమన్నాడు. వేలెడు లేడు. వీడికెందుకీ ఉత్సాహం?' అనుకొంది శాంత.

వేలెడు లేడు కనకనే వీడికా ఉత్సాహం. ఈ ఉత్సవాల వెనక రాజకీయాలు తెలియవు కనకనే వాడికా ఉత్సాహం. ఉత్సవ విగ్రహాల్లా ఊరేగే ఊరేగింపులో భేషజాలు వాడికి అందవు గాబట్టే, వాడికీ ఉత్సాహం.

ఈ సభలు, ఈ సమావేశాలు, ఈ పూలదండలు, ఈ బాజా భజంత్రీలు, ఈ వాగ్దానాలు—ఇవన్నీ కేవలం ఒక షో—అని తెలిసిన్నాక, వాడిలా వూరు తెల్లారక మునుపు పరిగెత్తడు.

భర్త ట్రైనింగ్‌కి వెళ్ళగా, గోపిని దగ్గిర పెట్టుకుని, ఒక్కర్తీ కాలం వెళ్ళబుచ్చోంది శాంత.

రెండో క్లాసు చదువుతూన్న గోపికి మించిన బరువున్నాయి వాడి పుస్తకాలు. అన్నీ రోజూ పట్టుకెళ్ళాలంటాడు. వాడు తినే నాలుగు మెతుకులూ, ఈ పుస్తకాల మోతకి సరి. ఇహ నీ కుర్రసన్నాసి ఏం చదువు వెలగబెడతాడు? స్కూలు వూరి కొసని. దాదాపు మైలు దూరం, ఈ భారంతో వాడు వెళ్ళిరావడమే గగనమైతే—ఇహ చదువేమిటీ?

స్కూల్లో మాష్టర్లేం చెబుతున్నారో, వీడేం నేర్చుకుంటున్నాడో, అడగడానికి వీల్లేదు.

అలిసిపోయి, నిస్త్రాణగా, వాడిపోయిన తోటకూర కాడలా గోపీవచ్చి, పుస్తకాల సంచీ మూలపడేసి, అరుగుమీద 'ఉస్' మని చతికిల బడేప్పటికి, శాంత కళ్ళల్లో నీళ్ళు తిరిగేవి.

'ఎందుకొచ్చిన చదువిది? వాడి ప్రాణానికి సుఖంలేక పోయాక? పది రూపాయలు పోతే పోయాయి. ఇంటిదగ్గరే ప్రైవేటు చెప్పిస్తేనో—' అంటే

'మంచిదానివే, పిల్లలు పదిమందిలో తిరక్కపోతే, ఏవన్నా వచ్చొస్తాయా? దూరమనీ, దగ్గిరనీ, చిన్నపిల్లాడనీ—ఆలోచిస్తే, చదువెలా వస్తాయ్? పొరుగూరునుండి వచ్చి చదువుకుంటున్నారు పిల్లలు. మరి వాళ్ళమాటేమిటంటావ్? చదువుతూన్నది, బాధపడుతూన్నది మన పిల్లవాడొక్కడే కాదు కదా—' ఇది నారాయణరావు జవాబు.

'ఏమిటో మీరలా అంటారుగానీ, వాడి పోయిన ముఖంతో, కుర్రవెధవ వుసూరుమని ఆ ఎండలో అంతదూరంనుంచి, బండెడు పుస్తకాలతో, ఒళ్ళంతా చెమట్లతో వస్తూంటే, చూళ్ళేక నా మనసు తరుక్కుపోతూంది. మీకేం ... ఎన్నైనా చెప్తారు. ఆడదై పుడితే తెలిసేది తల్లి మనసు.' శాంత బాధపడేది.

ఇంటి దగ్గర ప్రైవేటు చెప్పించడానికి నారాయణరావు అభ్యంతరం చెప్పలేదుగానీ, స్కూలుకుమాత్రం ప్రతిరోజూ వెళ్ళి రావాలన్నాడు.

ఉదయం ఎనిమిదికి, ఒకచేత్తో క్యారేజీ, మరోచేత్తో పుస్తకాలసంచీ పట్టుకుని



స్కూలుకెళ్తే సాయంత్రం అయిదు దాటాకగానీ, ఇల్లు చేరడు గోపీ. మరి నడవాలా?—వచ్చి నీళ్ళు పోసుకుని, బట్టలు మార్చుకుని, కొంచెం పాలు తాగేప్పటికి ప్రైవేటు మాష్టారు రడీ.

ఆరునుండీ, ఏడున్నర వరకూ ఆయనేం చెప్తాడో, అలిసిపోయి, కూరుకుపోతూన్న కళ్ళతో వీడేం వినేవాడో... ఏవీ అంతు పట్టదు శాంతకి.

'అసలెందుకొచ్చిన చదువులివి? ఏంచక్కా తెలుగు, లెక్కలు నేర్చుకుంటే చాలదా? అలా అయితే, తానే ఇంటిదగ్గర నేర్పగలదే'—ఇదీ ఆమె ఆలోచన.

'ఇందిరాగాంధీకి జై. నెహ్రూ చాచాకి జై...' అనే కేకలు విని, వీధికేసి చూసింది.

గర్ల్స్ స్కూలు పిల్లలు రంగు రంగుల బట్టలు వేసుకుని, జెండాలు పట్టుకుని, బారులుతీరి వెళ్తున్నారు. వెనకగా మేష్టమ్మలు కూడా, ముసిముసిగా నవ్వుకుంటూ, వాళ్ళలో వాళ్ళేవో కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు. హిందీ టీచరమ్మతో, కొత్తగా చేరిన సైన్స్ అసిస్టెంట్ సూర్యం ఏదో జోకు వేశాడు. ఆవిడ విరగబడి నవ్వుతోంది—, ముఖం మీద పడ్డ వెంట్రుకల్ని సరిచేసుకుంటూ, చెదిరిన పవిటను చూడనట్టు నటిస్తూ.

ఆ గుంపు వీధిమలుపు తిరిగాక, ఇంట్లోకొచ్చి, స్నానం అయిందనిపించి, ఇంత కాఫీ తాగింది శాంత. గోపీ తినకుండా వెళ్ళిన ఉప్మా, తినబుద్ధి వెయ్యలేదు ఆమెకి.

'చంటివెధవ ఆకల్తో వెళ్ళగా, నేను కూచుని మింగనా' అనుకుని, గబగబా వంటప్రయత్నం చేసింది. గోపీకి ఇష్టమని టొమాటో పెరుగుపచ్చడి, కందిపప్పు, చారు రడీ చేసింది. బంగాళాదుంపలు తరిగి ఉడకబెట్టడానికి స్టౌమీద పెట్టి, టైం చూసింది.

తొమ్మిది కావస్తోంది. ఇప్పుడో మరో ఘడీకో మంత్రిగారొస్తారు. ఓ గంటలో తతంగమంతా ముగుస్తుంది. పది దాటాక గోపీ వస్తాడు. దుంపలు వుడికాక, తొక్కలు వొల్చేసి వుంచేస్తాను. గోపీ నీళ్ళోసుకుని, బట్టలు మార్చుకునేలోగా అవి దోరదోరగా వేయించి, వేడివేడిగా పెట్టేస్తాను...ఇలా అనుకుని, పని చకచక కానిచ్చింది శాంత.

# మంత్రిగారొస్తారు!

కిది దాటిపోయింది: ఈలోగా వీధిలోకి ఓ అరడజను పార్టీనా వెళ్ళొచ్చింది. జనం ఏవరిమట్టుకు వారు, దేశాన్నుద్ధరించేసేంత గాభరాలో పడిపోయి, వడివడిగా పోతున్నారు.

'అప్పుడే పద్నాటిపోయింది వెధవ.. ఆకలికేం గిలగిల్లాడిపోతున్నాడో? ఎందుకొచ్చిన మీటింగది...పొద్దున్న వెళ్ళినవాడు ఇంతవరకూ ఏం తినకపోతే ఏమైపోవాలి—' విలవిల్లాడిపోయింది శాంత.

లోపలికి వెళ్ళి, గబగబా ముక్కలు వేయించి, గోపీ కేరేజితీసి, అందులో వాడికోసం భోజనం సర్దేసి, ఓగ్లాసుడు మజ్జిగ తాగి, ఇంటికి తాళంపెట్టి కేరేజీ తీసుకుని బయల్దేరింది స్కూలుకి. వాడికి నాలుగు మెతుకులు తినిపించకపోతే, ఆ తల్లిమనసు వూరుకోనంది.

రోడ్లు జండలతో అలంకరించారు. జీపులు, ఏన్నడూ చూడని కార్లు, హడావిడిగా తిరగుతున్నాయి. ఖద్దరు పంచలు, గాంధీ టోపీలు కొల్లలుగా, గాంధీగారి గురించీ, యాహ్యాఖాన్, భుట్టోల గురించీ— ఏవేవిటో మాట్లాడేసుకుంటున్నారు. ఇద్దరు ఫోటో గ్రాఫర్లతో, పంచాయతీ ప్రెసిడెంటుగారు—

'ఇదిగో...మరిప్పుడే చెప్తున్నాను. మరి మంత్రిగారి పక్కన మనం నిలవగానే సిటుకు సిటుకుమని నొక్కేయాలి. పేపర్లో మనబొమ్మ పడిపోవాల. మరేటనుకున్నావో మనంటే ... అన్నరేగానీ ... కాపీలాగేరా... దానికేట్నండీ...తాగితే మరితాక్కూడదేటి? మరి కుపింత పుచ్చుకోవయ్యా...మీకు తెల్దుగానీ...మరి...ఏది...మా బామ్మర్ది నేడూ... యాడండీ...గేనపురంమెంబరండీ...వాడు... వీహారు కాపీలకిలగొత్తన్నరుగానీ...ఒడ్డైతే ఇంకీ...ఓసీసా ఎట్టేసినా ... ఏదీ...అదేనే వయ్యా ... ఉఫ్ మని ఊదెయ్యడూ ... హహ్హహ్హా...' అంటూ విరగబడి నవ్వాడు.

'ఆ...మన్లో మనమాట...మా బామ్మర్ది యీదన్నుకొస్తేగాని, ఇలాంటివి తెలవ్వు .. వమానికి తెలిసిందిగానీ...నేపోతే...ఇరకాస్సైపోయేది ... ప్లరేయ్ ... యౌవ్ డాడా ... వత్తైవూ ... ఇళ్ళొత్తందర్గ రవిమ్మా ... మన మంత్రిగారి బోసిలయాక ... ఏదీ ... ఆదేరా ... నీకు తెల్దుగానీ... మన మందరయ్యా నేడూ... ఆడికి చెప్పా నాన్నెప్పి నాపని...దాన్సిగ తరగ...ఈదెబ్బతో మనూరి ఇస్కూలు, పట్నం కాసింగువొరకు రోడ్డు, ఆ వడవటి సెరువు... ఈ కాంట్రాక్టులన్నీ మన సేతిలోకి రావాలి...' అలిసిపోయి, ఆగిపోయి, పోలీసు జీపుమాసి, గబగబా మెట్టు దిగాడు ప్రెసిడెంటు.

'నౌస్కారం యస్సైబాబూ...ఏటిలా దయసేసినారు ... ఓ ... మంత్రిగారొస్తారు కదూ ..' ఒదిగిఒదిగి జీపుపక్కన నిల్చున్నాడు.

'ఔనయ్యా! అది సరేగానీ, మంత్రిగారి కారు మధ్యలో రిపేరొచ్చింది. ఎండలో మంత్రిగారు కతకతలాడి పోతున్నారు. ఓ మంచినీళ్ళైనా దొరకవ్. ఏం వూరయ్యా ఇదీ...మరి తొందరగా ఎదురెళ్లండి...' అధికార హోదాలో అన్నాడు యస్సై.

'ఎంత మాటెంతమాట. ఎండ ఫేరేల్మని పోతంటే. ఇద్గో ఇప్పుడే బయలెల్తున్నాను.' అంటూ ఓ జీపునిండా తినడానికీ, తాగడానికి సామాన్లు నింపేసి, కన్నుమూసి తెరిచేలోగా మాయమయ్యాడు ప్రెసిడెంటు.

ఈ మాటలు వింటూన్న శాంత 'ఇంకా ఎంత సేపౌతుందో మంత్రిగారొచ్చేసరికి ఇప్పటికే పదకొండు దాటుతోంది. ఇంతా ఇంతా స్కూలు పిల్లలు, ఈ ఎండలో ఏమైపోవాలి? మంత్రిగారొస్తున్నారనే సరదావే తప్ప, తమకేం ఒరుగుతుందో అక్కర్లేదు కదా ఈ పసివాళ్ళకి. మంత్రిగారు కార్లో కూర్చుని ఎండబాధ అనుభవించేస్తున్నారట. జీపునిండా తినుబండారాలు కూల్ డ్రింక్స్ వెళ్ళాయి. లోటికేడులేని ఈ నోరులేని పిల్లలేం తిన్నారో, ఈ ఎండలో ఎలా నిలబడగలుగుతారో ఎవరికీ అక్కర్లేదు. ఏం మనుషులో—' అనుకుంది మనసులో, అక్కడచేరిన పిల్లలగుంపులో తన గోపీని వెతుక్కుంటూ.

గోపీ అక్కడ కనబడలేదు. ఎలిమెంటరీ; మిడిల్ స్కూలు పిల్లలందరూ, మైదానంలో వున్నారని విని, ముఖానపట్టిన చెమటని తుడుచుకుంటూ. ఆయాసంగా అక్కడికి చేరింది.

విశాలమైన ఆ మైదానంలో అరంగుళం మేర నీడలేదు. ముఖాలు వేళాడేసుకుని, తలలో పట్టిన చెమట, ధారలుగా ముఖం మీంచి, చెంపలమీంచి — చొక్కాలమీద పడుతూంటే, దిగాలుపడి, ఇంతింత వెధవలూ నిల్చొని వున్నారు.

మంత్రిగారికోసం పెద్ద వేదిక కట్టారు. దానిమీద, మెత్తని పెద్ద పెద్ద కుర్చీలు అమర్చారు. ఎక్కణ్నుంచో కరెంటుతెచ్చి, మూడు స్టాండింగ్ ఫాన్లు ఫిక్స్ చేశారు.

ఆ చల్లని నీడల్లో ఆశీనులయ్యే మంత్రిగార్ని తలుచుకుని, ఇలా ఎండల్లో మాడిపోతున్న ఈ చంటివెధవల్ని చూసి శాంతగుండె చెరువైపోయింది.

'ఎవరెలాపోతే తనకేం? తన గోపీ ఎక్కడున్నాడో' అనే స్వార్థం ఆమెలో కలిగింది. ఆమెకళ్ళు వాడికోసం గాలించాయి. వాడెక్కడా కనబడలేదు. ఆమెలో ఆత్రుత ఎక్కువైంది. ఎవరో వెళ్తూంటే అడిగింది.

'చిన్నపిల్లల ఒడిపిల్లలేనా ... అదిగో అక్కణ్ణిల్చున్నారే వాళ్ళే. అందులో మీ అబ్బాయి లేడా?'

'లేడండీ...'

'లేకపోవడ మేమిటి? వుంటాడు చూడండి. పిల్లసన్నాసులు ఫండమన్న చోట వుంటారు గనకనా? ఏ చెట్టుకింద చేరి ఆడుకుంటున్నారో...' అంటూ చక్కాపోయాడు చొక్కారావు. అవునుమరి కాస్త పెద్దచొక్కా వేసుకున్న అతనిపేరు అదే ఐవుండాలి.

ఇంతలో కొంతమంది ఆదరాబాదరా వేదికమీద చేరారు. అందరి దృష్టి అటు మళ్ళింది. మైకు పలికింది.

'—మంత్రిగారి కారు పాడైంది. తోవలో వున్నారు. మరోగంటలో వారు రానున్నారని చెప్పడానికి సంతోషిస్తున్నాం. ఎవరూ వెళ్ళిపోకండి. మంత్రిగారొస్తారు. పిల్లలకి మిఠాయి పంచిపెడతాం—'

'ఇంకా ఎంతసేపౌతుందో భగవాన్. గోపీ కనిపిస్తే, హాయిగా ఇంటికి తీసుకుపోదును—' అనుకుంది నాలుగు దిక్కులూ చూస్తూ శాంత.

వీరభద్రంగాని, రాజుగాని కనబళ్ళేదు. 'వీళ్ళు ముగ్గురూ తప్పిపోలేదు కదా—' అని శాంత, వెర్రెత్తిందాన్లా ఆ ప్రాంతమంతా తిరిగింది. ఎక్కడా వాళ్ళ జాడ లేదు.

మరోగంట గడిచింది. మంత్రిగారు ఊళ్ళోకి వచ్చారనేవార్త నిమిషాల్లో చేరింది సభాస్థలికి. ఇక్కణ్నుంచి ఎవరో తరుము

తున్నట్టు, జనమంతా వూళ్ళోకి పరిగెత్తారు.

పిల్లలు కూడా పోలోమని, హోరని– గోలచేస్తూ, ఏదో వెర్రి ఉత్సాహంతో, కేకలేస్తూ పరిగెత్తారు. అందులో గోపీ ఎక్కడ వున్నాడని వెతుకుతుంది శాంత? లేక తామకూడా ఆ గుంపువెనక ఎంతకని పరిగెడుతుంది?

మంత్రిగారు భోజనం చేశాక, సభ ప్రారంభిస్తారట. ఎప్పుడో ఉదయం ఏవి మిదికి పక్కవూళ్ళో కాస్త ఉపాహారం తీసుకున్నారట.

అంచేత జనం, స్కూలు పిల్లలూ అపరిమితానందంతో, అమిత భయభక్తులతో, ఆయన భోజనం చెయ్యడం— తమందరికీ ఏంతో ఉపకారమైనట్టుగా, నిల్చున్నారు పంచాయతీ ఆఫీసుబయట ఎండలో.

మరో గంటకి తిరిగీ సభాస్థలం అంతా జనంతో నిండిపోయింది. మనుష్యులు ఒకర్నొకరు తోసుకుంటూ, జాగాలు చేసుకుంటున్నారు. ఆ తోపులాటలో, శాంత చేతిలో కేరేజి కిందపడి, విడిపోయింది. వండినవన్నీ నేలపాలైనాయి. అంతవరకూ కనబడని ఓ కుక్క, ఆదరాబాదరావచ్చి, ఆ ఆహారాన్ని హాయిగా లొట్టలేస్తూ అరగించింది.

శాంత మనసు గిలగిల కొట్టుకుంది, గోపీ కనబళ్ళేదు. వాడికోసం తెచ్చినది ఇలా మట్టిపాలైంది.

'మంత్రిగారొస్తే వీడికి కలిసి వచ్చిందేమిటి?' కసిగా అనుకుంది మనసులో శాంత.

సరిగ్గా ఆ సందంటే అయిదే నిమిషాలు మంత్రిగారు మాట్లాడారు. శాంతకి మంత్రిగార్ని చూడాలనే దృష్టిగాని, ఆయన పలుకులు వినాలనే ధ్యాసగాని కలగేలేదు.

'గోపీ ..ఎక్కడి కెళ్ళావ్ నాయనా··· ఈఎండలో, ఈ జనసముద్రంలో నిన్నెక్కడని వెతకను బాబూ...' ఆమె మాతృహృదయ క్షోభించింది కళ్ళల్లో నీళ్ళు ఉప్పెనగ బయటకుబికాయి.

'...కాబట్టి మీరంతా త్యాగం చెయ్యాలి ఓపూట భోజనం మానైనా, దేశానికి కొంత సేవచేయాలి..., జేవ్ ..., జేవ్....' తిన్న మసాలా కూరల వాసనలు, తేన్పుతో ముక్కుపుటాల్ని ఆనందపరచగా, విర్రి కారంగా, తేజోమయంగా, మంత్రిగారు సుభాషితులయ్యారు.

జనం తన్మయంతో చప్పట్లవాన కురిపించారు. వేదిక ఖాళీ అయింది. ఎవరి మట్టుకువారు, హడావిడిగా నడిచిపోయారు.

'గోపీ ఏమైనాడు' ఇదే ఆలోచన శాంతలో గింగుర్లు కొట్టింది. పిల్లల్నడిగింది. మాష్టర్లనడిగింది. అందరూ— ఇక్కడే వుంటాలనీ, మేం చూశామే—అనీ అన్నారేగాని, గోపీ ఎక్కడా కనబడేలేదు శాంతకి.

ఖాళీ కేరేజీతో, ఉసూరుమంటూ, బరువైన గుండెతో గోపీ ఏమైపోయాడో అనే బెంగతో, ఇంటి గుమ్మంలో అడుగు పెట్టిన శాంత మనసు ద్రవించి, సముద్ర కెరటాల్లా దుఃఖం ముంచుకొచ్చింది అక్కడి దృశ్యం చూసి.

అరుగుమీద, పుస్తకాల సంచీ తలకింద పెట్టుకుని, మట్టి కొట్టుకుని, నీరసించి, పీక్కుపోయిన ముఖంతో, ముడుచుకుని పడుకున్న గోపీనిచూసి, ఆమె ఆగలేకపోయింది.

'గోపీ...లేనాయనా...ఇదేం ఖర్మరాబాబా ఇలా నేలమీద పడుకున్నావ్ ... ఎంత సేపైందిరా నాన్నా వచ్చి ... పాపిష్టిదాన్ని... నీకోసం వచ్చాననే అనుకున్నానుగాని...వా కోసం నువ్వు వచ్చి వుంటావనే ఆలోచనే రాకపోయిందిరా నాకు...' ధారా ప్రవాహంగా కురుస్తూన్న కన్నీటిని తుడుచుకోనైనా తుడుచుకోకుండా, గోపీని ఒక్క ఉదుట్న గుండెలకు హత్తుకుంది.

గోపీ కళ్ళుతెరిచి, నీరసంగా శాంతని చూశాడు. తల్లిని చూడగానే వాడిలో నీరసం ఉఫ్ అని వూదినట్టు ఎగిరిపోయింది.

'అమ్మా...అమ్మా...ఎక్కడి కెళ్ళావే... ఇలా ఇక్కడే గంటైంది పడుకున్నానే... ఆకలేసి పోయిందే ... కాళ్ళు నెప్పెట్టిపోయాయే ... అబ్బ ఎంతెండనుకున్నావ్... అమ్మా ... మంత్రిగారొచ్చారే, మాకు మిఠాయిలు పంచారే...! అంటూ కుడిచేయి పిడికిలి విప్పాడు.

బంకపట్టి, మట్టికలిసిన పింసకెన్నంత పిప్పరమెంటు బిళ్ళ ఉంది.

'రెండిచ్చారే. ఒకటి నేను తినేశాను. ఇది . నీకు...'

హృదయం కరిగిపోయి, కన్నీళ్ళుగా ప్రవహిస్తూంటే, గోపీ వంక చూస్తూ 'నా బాబూ' అనుకుంది శాంత






### జరిగిన కథ

మాధవరావు ఆ వూళ్ళోకి స్కూలు మాస్టారిగా వచ్చాడు. ఎవరికో ఉపకారం చెయ్యపోతే అతను కుక్కకాటుకు గురి అయ్యాడు. బామ్మగారు అతన్ని ఇంటికి తీసుకువచ్చింది. అనురాధ తొలి చూపుల్లోనే అతన్ని ఆకర్షించింది. ఆ తర్వాత అతనిదగ్గర చదువుకోవడం ఆరంభించింది. రంగరాజు కొడుకు రాజారావు ఊరికి ప్రెసిడెంటుగా వెళ్ళాడని ఆమె చాలా బాధపడింది. మాధవికి పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిపోయింది. రాజారావు రాధని నిర్బంధించాడు. మాధవరావుకు సంబంధించిన ఒక రహస్యాన్ని వెల్లడించాడు. రాధ నమ్మలేదు. రాజారావు అత్యాచారం చెయ్యబోగా ఆమెకి స్పృహ తప్పింది మాధవరావు ఆమెని రక్షించాడు. దెబ్బలు తగిలిన మాధవరావు రాధ సపర్యలతో కోలుకుంటాడు. మాధవరావు తల్లి విషాదగాథ రాధని కలచి వేస్తుంది. శశికళతో తన పరిచయాన్ని రాధకి వివరిస్తాడు మాధవరావు. అతని కథంతా చెప్పుకు వచ్చాడు. అన్నగారు ఎలా వంచించిందీ వివరించాడు. అనురాధకి ఇప్పుడు అతనిమీద అభిమానం మరింతగా పెరిగింది. వారిద్దరికీ పెద్దలు వివాహం నిశ్చయించేశారు. అంతా పెళ్లి హడావిడిలో వున్నారు. ఒక రాత్రివేళ రాజారావు అనురాధని బలవంతంగా ఎత్తుకు పోయాడు. మాధవరావు ఆమెని కాపాడాడు.

## 24

మరునాటికి కొంచెం లేచి కూర్చోగలిగే శక్తి వచ్చింది. రాఘవరావుగారు రాజుని తీసుకొని ప్రొద్దున్నే వచ్చారు. కుశలప్రశ్నలయ్యాక, '...మళ్లీ రేపు ప్రొద్దున్నే వస్తానమ్మా!' అని లేచారు రాఘవరావుగారు.

ఏదో అడగబోయాను. ఎలా అడగాలో అర్థం కాలేదు. గోడమీది కేలండరులో ఆనాటి తేదీ కొట్టవచ్చినట్లు కనపడింది. ఆపాటికి పెళ్లి జరుగుతూండవలసింది. కాని, హాస్పిటలు పాలయ్యాను నేను. మిత్రుల సహాయంతో, శ్రేయోభిలాషుల సహకారంతో తలకుమించిన ఎత్తున నా పెళ్ళికి ఏర్పాట్లు చేసారు నాన్నగారు. కాని, నేను నిర్భాగ్యురాల్ని. నామూలాన ఆయన కష్టాలపాలు కావల్సివచ్చింది. డబ్బుకు డబ్బూ ఖర్చయింది. ఫలితం దక్కలేదు. నా పెళ్లి ఆగిపోయింది. నాన్నగారికిదెంత దెబ్బ! నా మనస్సు వికలమైపోయింది. నేనడగబోయే ప్రశ్నలు ఎంత బాధాభరితంగా ఉంటాయో నాకు తెలుసు... ఆయనకు తెలుసు. అందుకనే రాఘవరావుగారు వెంటనే అక్కడినుంచి వెళ్ళిపోయారు. ఆయన వెనుకనే మాధవి బయటకు వెళ్ళింది.

రాజు బిక్కముఖం వేసుకొని నావైపు చూస్తున్నాడు. వాడికోసం నేను ముఖంలోకి చిరునవ్వు తెచ్చుకోవల్సి వచ్చింది. వాడిని చేతుల్లోకి తీసుకొని ఇంటి విషయాలు ఒక్కొక్కటే అడగటం మొదలుపెట్టాను. జరిగిన దుస్సంఘటన గురించి రకరకాలుగా కథలు చెప్పుకుంటున్నారు బంధువులు. పెళ్ళి జరగని పెళ్ళివారింట్లో విందుకు కుడిచి ఒక్కొక్కరే ప్రయాణమవుతున్నారు. అంటే ఇక ఇప్పట్లో ఈ పెళ్ళి జరగదని అందరూ భావించారన్న మాట! అలా ఎందుకనుకోవాలి? నన్నంతా అవమానిస్తున్నట్లు బాధతో క్రుంగిపోయాను.

వివరేమనుకున్నా అతను దగ్గరుంటే నాకీవ్యథ ఉండేది కాదు. అతనేడి?

'రాజూ! మాస్టారు రాలేదా!' అని అడిగాను.

'మాస్టారు, డాక్టరుగారు విశాఖపట్నం వెళ్ళారటక్కా!'

ఉలిక్కి పడ్డాను. 'ఎందుకు?'

'ఏమో మరి.'

నా మనస్సు పరిపరివిధాల పోయింది. నేనింత ప్రమాద స్థితిలో ఉన్నానని తెలిసికూడ వాళ్ళు విశాఖ వెళ్ళారంటే అక్కడేదో జరిగి ఉండాలి. మాధవి రాకకోసం క్షణాలు లెక్కపెట్టుకుంటూ కూర్చున్నాను.

కొంతసేపటికి మధూ లోపలికి వచ్చింది. '...నిర్మల హృదయుల్ని హింసిస్తే దేవుడు శిక్షించడా! రాజారావు తగిన ఫలం అనుభవించాడు' అంది.

నేనాత్రతతో,' ఏం జరిగింది?' అని అడిగాను

'మా ఉత్తర పొలంలో సుబ్బారాయుడి గుడిముందు చచ్చిపడి ఉన్నాడట. నాగరాజు కాటేసాడు...'

ఉలిక్కి పడ్డాను, 'అయ్యో, పాపం!'

మధూ చిత్రంగా చూసింది నావైపు. 'నువ్వు ఆ దుర్మార్గుడిమీద సానుభూతి చూపుతున్నావా వనూ! వాడు నిన్నెంత దారుణంగా కొట్టాడో తెలుసా?... మేమప్పుడే భోజనాలు చేసాము. రాజు పరిగెత్తుకువచ్చి చెప్పేసరికి నిర్ఘాంత

పోయాము: ఊరుకు పరుగులమీద మేము వచ్చేసరికి నువ్వు రక్తపు మడుగులో పడి ఉన్నావు. మీ నాన్నగారు స్పృహ తప్పిపోయి ఉన్నారు. అప్పటికి లైట్లు వెలిగాయి. అసలు లైట్లు ఆరిపోటానికి కూడ రాజారావే కారకుడు. వైర్‌మెన్‌కి పాతిక రూపాయలు లంచం ఇచ్చి సరిగ్గా ఎనిమిది గంటలకి మెయిన్స్ ఆఫ్ చెయ్యమన్నాడట. నిన్న కర్ణంగారు కేసు పెట్టిస్తానని బెదిరిస్తే నిజం చెప్పాడట ఆ వైర్‌మెన్...'

'నే నిలా జరిగిందని ముందే ఊహించాను.'

'నాన్నగారు నిన్ను చూస్తూనే ఇది అతని పనేనని గట్టిగా అరిచారు. వెంటనే పోలీసు రిపోర్టు ఇమ్మని మునసబుగారికి కబురంపారు, అతన్ని వెంటాడి పట్టుకోటానికి చాలామంది తలో మూలకీ పరిగెత్తారు. రాజారావు ప్రాణభయంతో పొలాలకడ్డంగా పరిగెత్తి రాత్రి గుళ్లో గడిపినట్లున్నాడు...అతను పాముకాటు తిని చనిపోయాడని పొలాల మీదకు వెళ్ళినవాళ్లు చూసి చెప్పేవరకు అతన్నెవరూ చూడలేదు. చచ్చినవాడిమీద కేసెందుకని నాన్నగారనటంతో పోలీసులు వెళ్ళిపోయారట. అనకూడదుకాని ఎవరు తీసిన గోతిలో వాళ్ళే పడతారన్న మాట నిజం!...'

'పోనీలే! ఒకరిని గురించి మనం చెడు చెప్పుకోవట మెందుకు?...అదిసరే. ఆయువ డాక్టరు వేణు విశాఖ వెళ్ళారని రాజా చెప్తున్నాడు, ఎందుకు వెళ్ళారు? నాతో చెప్పకుండా వెళ్ళా రెందుకని? అసలేం జరిగింది.'

మధు ఉలిక్కిపడినట్లయి రాజావైపు చూసింది క్షణంసేపు. ఆ వెంటనే, 'వాళ్ళు విశాఖ వెళ్ళినమాట నిజమే అమ్మా! కాని ఎందుకు వెళ్ళారో నాకు తెలియదు...' అంది ఆమె.

'పోనీ ఎప్పుడొస్తారో తెలుసా!'

'...తె...లి...య...దు...'



'నేను బాధపడతానని అలా చెప్తున్నావు మధూ! నాకు తెలుసు. ఆయనింక తిరిగిరారు...' అన్నాను నిస్పృహగా.

'లేదు అనూ! ఆయన్ని అపార్థం చేసుకోకు. నీ గాయంనుంచి రక్తం బాగా కారిపోయిందని వెంటనే ఎవరైనా రక్తదానం చేయాలని ఇక్కడి డాక్టర్లు అన్నప్పుడు అందరికంటె ముందుకు వచ్చిన మొదటి వ్యక్తి ఆయన. అటువంటి త్యాగమూర్తిని శంకించకు...'

'అంత పని జరిగిందా మధూ! ... అయితే ఆయనకేమీ ప్రమాదం జరగలేదు కదా!...'

'లేదు. ఆయన క్షేమంగానే ఉన్నారు. ఆయన రక్తం నీ రక్తం గ్రూపుకు సరిపోలేదుట. నేను ముందుకు వస్తే నా రక్తాన్నివ్వనివ్వలేదు వేణు. 'రాధమ్మ దుస్థితిలో ఉండగా మా ఇంటిలోమాత్రం ఏలా శుభకార్యం జరిపిస్తాను? ... ఫర్వాలేదు. ఆమ్మాయి రక్తం సరిపోతుందేమో చూడండి...' అన్నారు నాన్నగారు. 'తర్వాత రాధకు సేవ చేయటానికైనా మాధవికి ఓపిక ఉండాలి...'అని అంటూ నా కడ్డం వచ్చాడు వేణు. తన రక్తం టెస్టుచేసుకు వచ్చి తన గ్రూపు సరిపోయిందని చెప్పాడు. తన రక్తాన్ని ఇచ్చి నీకు ప్రమాదం తప్పిందని అతడే బయటకు వచ్చి చెప్పాడు. అంతవరకు స్థాణువుల్లా కూలబడిపోయాము మేము. వాళ్ళకున్న మనస్థైర్యం మాకు లేకపోయింది...'

నా మనస్సు ఆర్ద్రత చెందింది. కళ్ళనీళ్ళు తిరిగాయి...' అవును మధూ! వాళ్ళు మనుషులు కారు...దేవతలు...'

* * *

నాల్గు రోజులు గడిచిపోయాయి. నాకు స్వస్థత చేకూరింది. లేచి కాసేపు అటు ఇటు తిరిగే శక్తి వచ్చింది. రోజూ రాఘవరావుగారు, నాన్నగారు వచ్చి చూస్తూనే ఉన్నారు. హెడ్మాస్టారు, కర్ణంగారు, రంగదాసు, శంకరయ్య, సీతామణి, స్కూలు పిల్లలు—అభిమానులంతా వచ్చి నన్ను కుశల ప్రశ్నలువేసి వెళ్ళారు. మాధవి, రాజు అనుక్షణం నన్నరిటి పెట్టుకునే ఉంటున్నారు. కాని, ఎంతమంది సానుభూతి లభించినా, చచ్చి బ్రతికిన నన్ను చూడటానికి అతడింతవరకు రాకపోవటం నాకు హృదయ శల్యమవుతోంది.

ఎన్నిసార్లు వాళ్ళగురించి అడిగినా, '...ఏదో కారణంవల్ల ఆలస్యమయింది అనూ! వాళ్ళు తప్పక వస్తారు. నువ్వే ఆలోచనలు పెట్టుకోకు...'అంటూ ప్రస్తావన మార్చేసేది మాధవి. ఆమె ఓదార్పుల వల్ల నామనస్సు కుదుటపడలేదు. స్వాతివానకు ముత్యపు చిప్పలా అనుక్షణం గది గుమ్మం వైపు కనురెప్ప వేయకుండ చూస్తూ కూర్చునే దాన్ని.

ఆఖరికి ఆమె చెప్పకుండ దాచిన విషయం నాకు తెలియనే తెలిసింది!

ఇక రెండు మూడురోజుల్లో నన్ను హాస్పటల్ నుంచి డిస్చార్జి చేయవచ్చని డాక్టరు అన్నారని చెప్పింది మాధవి. చెరసాలవంటి ఆ జీవితాన్ని భరించలేక ఇంటికి వెళ్ళి, పిన్నిని, పాపాయిని చూస్తూ జరిగిన దుస్సంఘటనలను మర్చి పోవచ్చను కున్నాను.

పళ్ళు తీసుకు వద్దామని రాజుతో బయలుదేరి వెళ్ళింది మాధవి. ఏమీ తోచక పక్కమీద నుంచి లేచి అటు ఇటు గదిలో కొంతసేపు తిరిగాను. ఏదో నిస్సత్తువ క్రమ్మింది. తూలి పడబోయి మంచాన్ని ఆనుకొని మెల్లిగా పక్కమీదకు చేరాను. తలగడ సర్దుకోబోయి దానిక్రింద ఏదో పుస్తకం ఉండటం చూసాను. చేతుల్లోకి తీసుకొని ఆ పుస్తకాన్ని తిరగేసాను: శరత్ 'శేషప్రశ్న' అది. మాధవికి శరత్ నవలలపై మక్కువ ఎక్కువ. నేనూ కొన్ని చదివాను. శేషించిన ప్రశ్నలతో వేగిపోతున్న మనస్సును ఆ నవలపై లగ్నం చేయలేక పేజీలు అటు ఇటు త్రిప్పుతూ కూర్చున్నాను. ఇంతలో ఒక కాగితంమడత దాంట్లోంచి జారి నా ఒళ్ళో పడింది. కుతూహలంగా ఆ మడత విప్పాను,

మొదటి వాక్యం చదివి ఉలిక్కిపడ్డాను చేతులు వణికాయి. గుండెలు దడదడలాడాయి. అది అతను నాకు వ్రాసిన లేఖ! నేనెప్పుడూ అందుకోని లేఖ! గుండెలరచేత పట్టుకొని ఆ ఉత్తరం చదవసాగాను.,

చి! సౌ! అనూరాధకు—

నిర్భాగ్యుడు మాధవ్ వ్రాయునది.

ఇటువంటి ఉత్తరం వ్రాయవలసిన దుస్థితి నా జీవితంలో కలుగుతుందని నేనెప్పుడూ ఊహించలేదు. నిన్ను విడిచి పోవలసి వస్తుందనీ నేననుకోలేదు. కాని; రెండూ జరిగాయి. 'అనూ! మనల్ని దేవుడు కూడ వేరు చేయలేడ'ని ఒకనాడు నీతో ధైర్యంగా చెప్పిన నేనే ఈనాడు దిగజారి పోయి నిన్ను వేరు చేసుకొని వెళ్ళిపోతున్నాను.

రాధా! నేను దురదృష్ట వంతుడిని. అలా అని తెలిసి కూడ అందని పళ్ళ కోసం ప్రతిసారి ఆశిస్తూనే ఉన్నాను. భంగపాటు చెందుతూనే ఉన్నాను. విధి నా జీవితంతో పరిహాస మాడుతున్నది. అమ్మ ఆంటీ ఆనీ, శశికళ, వదిన—ఇంత మందిని పోగొట్టుకున్నాను. కాని, వాళ్ళందరులేని లోటును నువ్వు పూరించావు. నీ అనురాగంతో నా జీవితానికో క్రొత్త అర్థాన్ని చూపావు. గతమంతా పీడకలగా భావించ గలిగాను. భవిష్యత్తుమీద ఎన్నో తీయని ఆశలు ఏర్పరచుకున్నాను.

కాని, గుండెల్లో పొంగిపొరలే ఈ ఆనందం నాకు మొదటినుంచీ ఏదో తెలియని భయాన్ని కలిగిస్తూనే ఉంది. మాధవి నన్ను పెళ్ళికొడుకుని చేసినప్పుడు కూడ...ఇదంతా ఒక కలమాత్రమే ననిపించింది. అనుభవిస్తున్న ఆనందాన్నికూడ ఒక కలగామాత్రమే భావించుకునే దురదృష్టం నా ఒక్కడి జీవితంలోనే సంభవించింది

## చాకిరేవు

ఎందరో—

వేస్తారు వేషాలు.
చూస్తారు మోసాలు
దుస్తులు చాకలివద్ద అరువుకుతెచ్చుకుని
మస్తుగ అనేక ఉపాయాలునేర్చుకొని
చాకలి ఎలాచేస్తాడో వలువలుశుభ్రం
చాకిరేవుచూస్తే తెలుస్తుంది విషయం.
బండలపై తడిబట్టలు చావ మోదడం
అపరాధినిచావమోదినేరంబయటకిలాగినట్లు
కక్కిస్తాడు చాకలిమురికిని బయటికి.
చేస్తాడు బట్టలు శుభ్రంగా
మురికినీటిలోవాటినిఉతికి కూడా.
చాకలిచేతి చాతుర్యం! చాకి రేవుమహత్యం!
చెప్పనలవిగాని ఆశ్చర్యం.

—ఎల్. మాలకొండయ్య

# దేశవిదేశ సంగీత సభలకు మిమ్మల్ని తీసుకుపోయే 4-బ్యాండ్ల ట్రాన్సిస్టర్ రేడియో నెల్కో కప్రి





మాస్కో, బిబిసి లండన్, న్యూయార్క్, హవాయ్, ఏ స్టేషన్ అయినా సరే విని ఆనందించండి.

నెల్కో కప్రిలో—మీకు అంతులేని అవకాశాలు దొరుకుతాయి.

నెల్కో కప్రిలోని స్పష్టత ఒకసారి వింటేనే తెలుస్తుంది.

స్టేషన్ ఎంత దూరమైనా, ప్రపంచంలో ఏ మారుమూల ఉన్నా శబ్దం తొణకదు, గిజగిజలాడదు, స్టేషన్ మారదు.

మీకు ఎటువంటి గొడవ ఉండదు. మీ వాలు కుర్చీలో విశ్రాంతి తీసుకుంటూ, విదేశ రేడియో స్టేషన్లన్నీ వినండి—నెల్కో కప్రిలో.

దేశ విదేశాల సంగీత సభలకు మిమ్మల్ని తీసుకుపోయే ట్రాన్సిస్టర్ రేడియో—నెల్కో కప్రి

రూ. 405/-
స్థానిక పన్నులు అదనం

**4 బ్యాండ్ల**
**నెల్కో**
**కప్రి**

టాటావారి ఉత్పత్తి

Creative Unit-145

ది నేషనల్ రేడియో & ఎలెక్ట్రానిక్స్ కం. లిమిటెడ్
బొంబాయి • కలకత్తా • ఢిల్లీ • మద్రాసు

రాధా!

ఏంచేయను? నిన్ను నేను మోసగించలేను. నువ్వు ప్రాణాధికురాలివి. నన్ను మోసగిస్తే నన్ను నేను మోసగించుకున్నట్లే! తెలియని పాపానికి నేను బాధ్యుడను కాకపోవచ్చు కాని తెలిసికూడ నీకెలా అన్యాయం చేయగలను?

నిన్ను హాస్పటలుకు తీసుకురావటానికి ఆలస్యం అవటంతో బాగా రక్తం నష్టమయింది. వేణు తాత్కాలికంగా కట్టు కట్టినా రక్తం కట్టుపడలేదు. హాస్పటల్లో నీ పరిస్థితి చూసి డాక్టర్లు వెంటనే ఎవరైనా రక్తదానం ఇవ్వాలన్నారు. నీమీద ఆధారపడి ఉన్న మేమంతా నీవు లేకపోతే నిరాశయులైపోము! నేను ముందుకు వచ్చాను. కాని, డాక్టరు నా రక్తం పరీక్షించి అది ఉపయోగపడదన్నాడు. వెంటనే మాధవిని వారించి వేణు తానే ముందుకు రావడం అతడు తన రక్తం ఇచ్చి నిన్ను బ్రతికించటం జరిగింది.

నా ప్రాణాధికమైన రాధకు అవసరమైనప్పుడే నా రక్తం ఉపకరించలేదు. ఇక ఆమెతోటి వైవాహిక జీవితం గడిపే అర్హత నాకెక్కడిది?... వేధించిన ఈ ప్రశ్నతో ఎవరికి తెలియకుండ వేరే డాక్టరు దగ్గరకు వెళ్ళి నా రక్తం పరీక్షించమని చెప్పాను.

# రాగధార

ఆయన పరీక్షించాడు. నన్ను అనేక ప్రశ్నలు వేశాడు. అవమానభారంతో నా పూర్వగాథ చెప్పి నా బ్రతుకింత నికృష్టమవటానికి కారణ మడిగాను. ఆయన చెప్పాడు రాధా! విన్నాను. విని ముక్కలయిన హృదయంతో వెనక్కి వచ్చాను.

రాధా! మీ పిన్నిగారివంటి మూగవాళ్ళు, బామ్మగారివంటి చెవిటివాళ్ళు — ఇంకా గుడ్డివాళ్ళు, కుంటివాళ్ళు. భగ్నహృదయులు — విధి శాపానికి గురియైనవాళ్ళెందరో ఈ ప్రపంచంలో వున్నారు. కాని వాళ్ళు బ్రతకగలరు. వారికి సమాజంలో చోటుంది. తోటి మానవుల రాగధారలలో వారి జీవితాలు పునర్జీవంతో సుఖమయం కాగలవు. భగవంతుడిచ్చిన శాపానికి ముక్తి ఉంది—కాని మనిషి ఇచ్చే శాపానికి విముక్తి లేదు రాధా! నా తండ్రి చేసిన పాపం ఆయనతో తీరిపోలేదు. వారసత్వంగా తన నీచరక్తంతో నాకు జన్మ ప్రసాదించాడు. ఇన్నేళ్ళు ఎంత పవిత్రంగా గడిపినా తండ్రి పాపాన్ని పంచుకుపుట్టిన కొడుక్కి ఇంక విముక్తి ఎక్కడిది?!...

ఈ అనారోగ్యంతో నీ పవిత్రజీవితాన్ని ఎలా కలుషితంచేయను రాధా! తెలిసి కూడ ఈ పాపానికి ఒడిగట్టలేను. అందుకనే నిన్ను వదలి వెళ్ళిపోతున్నాను.

నా చేతికందిన అమృతభాండం నేలకూలి ముక్కలవటం—విధి నా కన్నీళ్ళు చూసి పరిహాసంగా నవ్వుకోవటం నాకు క్రొత్త కాదు. ప్రతిసారి నేను విజయహాసం చేయబోయి నేలకూలి గుండెలు ముక్కలు చేసుకుంటూనే ఉన్నాను.

నా జీవితంలో ఇంక వెలుగు ప్రసరించే క్షణాలు గతించి పోయాయి. జీవితం జీవించటానికే అన్న సత్యం వదిన నాకు తెలియజేసి జీవించటం నేర్పింది. అందుకనే నీ స్మృతులతోనే నేను బ్రతుకుతాను. నా గురించి నాకింకే బాధలేదు.

నీ గురించే నామనస్సు నలిగిపోతోంది రాధా! నీ హృదయాన్ని కుదుట పరచుకో! పవిత్రమైన నీ జీవితాన్ని ఒంటరి తనం వెంటాడ నీకు. నీవొక ఇంటి దానివి కావాలి. వేణువంటి పవిత్రుని జీవితంలో నీ భవిష్యత్తు ఉజ్వలం కావాలి. నీవీణా గానంలో జీవన రాగం పలికించి నీవు నిత్య సుఖదాయినివి కావాలి. ఆత్మ బలంతో నీవిది నెరవేర్చుకుని నాకు ఆత్మశాంతి కలిగిస్తానని మాటియ్యి. కాలమే ఈ గాయాలను మాన్పుతుంది. ఏదో ఒకనాటికి నిన్ను ఆశీర్వదించటానికి వస్తాను అప్పటికి నీ ముఖంలో నీలో ఎక్కడా ఖేదం కనపడకూడదు. ఎప్పటి నీ చిరునవ్వులతో నువ్వు నా ముందుకు రావాలి. అదే నా ఆఖరి కోరిక,

నీవాడిని కాలేకపోయినా నీకోసమే బ్రతుకుతున్నాను రాధా! నాకీ అదృష్టం చాలు!

ఆశీస్సులతో
—మాధవ్.

నా గుండెలవిసిపోయాయి. ఒక వెర్రి కేక పెట్టి వెనక్కి పడిపోయాను...ఆతర్వాత నా కేమయిందో తెలియదు.

స్పృహ వచ్చేసరికి ఎదురుగా డాక్టరు కనిపించారు. నర్సు, మాధవి, రాజా ఆతృతగా నావైపు చూస్తున్నారు.

'...ఆమె ఆరోగ్యం కుదుటపడేవరకు జాగ్రత్తగా ఉండాలి...' అని మాధవికి చెప్పి డాక్టరు వెళ్ళిపోయారు. నేను కళ్ళు మూసుకొని పడుకున్నాను. గది బయట నర్సు మాధవికి చెపుతున్న మాటలు నాకు



లీలగా వినిపించాయి: 'మరో నాల్గురోజుల దాకా డాక్టరు డిస్చార్జి చేయవద్దన్నారు ఆమె కెటువంటి బాధాకరమైన విషయాలు చెప్పకూడదు. ఆమె చాలఅదృష్టవంతురాలు కాబట్టి బ్రతికి బయట పడింది. కాని, ఆ దెబ్బకి మతి స్థిరం తప్పి ఉండేది.'

'...నెమ్మదిగా మాట్లాడు సిస్టర్! ఇప్పటికే నా తెలివితక్కువవల్ల ఆమెకు చెప్పకూడని విషయం తెలిసిపోయింది. ఆమెకేదైనా జరిగితే అదంతా...' మాధవి కంఠం కంపించింది. ఆ తర్వాత వాళ్ళ మాటలు నాకు సరిగా వినపడలేదు.

నా మెదడు మొద్దుబారిపోయింది. ఏడుపు రాలేదు. స్పందనలేని బొమ్మలా పడిఉన్నాను. చలనంలేని ఒక రాతిని చూసినట్లు నాకళ్ళు నన్ను చూసుకున్నాయి. సర్వం శూన్యమైనట్లు 'నేను' అనేది మిధ్య అన్నట్లు నిస్తేజంగా నిర్వికారంగా పడి ఉన్నాను. శూన్యంలోకి చూస్తున్న నా కళ్ళకు రెప్పలు మూతలువేసే శక్తికూడ సన్నగిల్లింది.

మాధవి, రాజా కొంతసేపటికి లోపలికి వచ్చారు. వాళ్ళవైపు నేను చూడలేదు. వాళ్లకు నన్ను పలకరించే ధైర్యం లేదు. బిక్కుబిక్కుమంటూ వాళ్ళు నావైపు చూస్తున్నారని నాకు తెలుసు. కాని, నన్ను నేను నిగ్రహించుకోలేని దాన్ని వాళ్ళేమని ఓదార్చను?

నర్సువచ్చి మందు ఇచ్చింది. యాంత్రికంగా ఆ మందు త్రాగాను. పక్క సరిచేసి నర్సు వెళ్లిపోయింది. నేను అలా శూన్యం లోకి చూస్తూ పడుకున్నాను.

ఇక నిగ్రహించుకోలేక పోయిందో ఏమో మాధవి చటుక్కున నాదగ్గరికి వచ్చి నాచేతులు పట్టుకొంది. 'అనూ! నాతో మాట్లాడవేమే?' అంది గద్గద కంఠంతో.

నేనామె కళ్లల్లోకి మూఢురాలిలా చూసాను. బిత్తరపోయిన మధూ కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. నాఒళ్లో తల పెట్టుకొని చంటిపిల్లలా ఏడ్చేసింది రాజా బిక్క మొహం వేసుకొని 'అక్కా! అక్కా!... ఏమిటలా ఉన్నావు?...' అన్నాడు.

నాగుండెని రాయి చేసుకున్నా ననుకున్నాను. కాని, అది మంచుగడ్డ మాత్రమే కాగలిగింది. ఆత్మీయుల అశ్రుధారలు ఆ మంచు

# కొన్నిసామాన్య వ్యాధులకు పథ్యా పథ్యములు

## కుసుమరోగులకు

ఇది స్త్రీలకు వచ్చే వ్యాధి. యోని వెంట తెల్లగానైన, ఎఱ్ఱగానైన, పచ్చగానైన, నల్లగానైన, జిగటుగా ద్రవము స్రవించెడి రోగమునకు, కుసుమ రోగమంటారు. దీనినే అస్రుగ్ధరము, లేక ప్రదరము అని కూడా అంటారు.

**పథ్యములు:—** ఈ రోగం గల వారు మంచి పాత బియ్యపు అన్నం, అంబలి తినవచ్చును. కంది, పెసర, మసర పప్పులు వీని కట్టు తినవచ్చును. అన్నంలో ఆవు నెయ్యి వేసుకోవచ్చును. పొట్లకాయ కూర, బీర కాయకూర, లేక అరటికాయ కూర, బెండకాయకూర, నక్కదోసకాయ కూర, నల్ల ఆనబకాయ కూర, బూడిద గుమ్మడి కాయకూర, పొన్నగంటికూర, మెంతికూర, పెరుగు తోటకూర, తినవచ్చును. మేక, మాంసం తినవచ్చును. దానిమ్మ, ఖర్జూర ద్రాక్ష, బత్తాయి, ఆపిల్, నేరేడుపండ్లు, తినవచ్చును. పంచదారతోచేసే మధుపదార్థాలు తినవచ్చును మితంగా తేనె త్రాగవచ్చును.

**అపథ్యములు: —** మోటు బియ్యపు అన్నం, కొత్తబియ్యపు అన్నం, బాగా ఉడకని అన్నం, తినకూడదు. సెనగపప్పు, ఉలవ పప్పులతో చేసే పదార్థాలు తినకూడదు. వంకాయ, మునగకాయ, చిక్కుడుకాయల కూరలు తిన కూడదు. ఈ వ్యాధి తగ్గేటంత వరకూ చేపలు తినకూడదు మానె పిండివంటలు, కాక, పైత్యం, గురత్వంచేసే పదార్థాలుతినకూడదు. మైధునంమానెయ్యాలి.

## అతిమూత్ర, మధు మేహరోగులకు

మేహాధిక్యతచే మూత్రం అధికంగా అయే రోగానికి 'అతి మూత్రము' అని అంటారు మూత్రం కొంచెం చిక్కనై తేనెవలె వడలెడు మేహరోగానికి మధు మేహము (డైబటిస్) అని అంటారు ఈ రోగాలకు సామాన్యంగా చెప్పపడిన పథ్యాలివి.

**పథ్యములు:—** రోగం బాగా ఎక్కువగా ఉన్నట్లయితే గోధమ అన్నంగాని, గోధుమ రొట్టెలుగాని, తినడం మంచిది. మరీ అంత అధికంగా లేకపోతే మంచి పాతబియ్యపు అన్నం తిన వచ్చును. డైబిటిస్ రోగులకు ఉలవ కట్టు, గోధుమ అన్నంలో కలుపు కొని, తింటూం[illegible] మేలు చేకూరుతుంది. పచ్చ పెసర, పాతకంది, చిరుసెనగ, వీని పప్పులు కట్లు తినవచ్చును. కాయ గూరలలో— లేత అరటి, పొట్ల, బీర, కొడిశ, అత్తి, మునగకాయల కూరలు— ఆకుకూరలలో మెంతి, ఎలుకచెవి, పులిచెంచలి కూరలా పువ్వులలో మునగ, అరటి, తంగేడు పువ్వుల కూరలు పథ్యమయినవి తెలక పిండిలో వేసి వండిన తంగేడు పువ్వుల కూర, ఈరోగులు తరచుగా తింటూండడం వల్ల మేలుచేకూరుతుంది. పాలు త్రాగాలని ఉంటే మీగడ తీసి వేసిన ఆవుపాలు త్రాగ వచ్చును. లేత కోడి, దుప్పి, లేడి, మేక, కుందేలు వీని మాంసములు తినవచ్చును. మధు మేహం ఎక్కువగా గలవారు పంచదార వేసుకోకుండా పాలు త్రాగాలి. గోధుమ రొట్టెలకు ఆవు నెయ్యి, రాసుకుని తినవచ్చును. అన్నంలో ఆవు మజ్జిగ కలుపుకుని భుజించవచ్చును. ఉసిరికాయ పచ్చడి అన్నం తినవచ్చును. నేరెడు, ద్రాక్ష, దానిమ్మ, ఉసిరిక, బత్తాయి, ఆపిల్ పళ్ళు తినవచ్చును. ఈ పళ్లయొక్క సారములు (ఎసెన్సు) త్రాగ వచ్చును. ఈ రోగులు గుర్రము, సైకిలు మొదలగునవి ఎక్కి స్వారీ చేయడం వల్ల రోగం కాస్త తగ్గుతుంది. ఈ రోగులు రోజూ వ్యాయామం చేస్తూ వుండాలి. దాహం మయినప్పుడు బాగా మరిగించి చల్లార్చిన పరిశుభ్రమయిన నీరు త్రాగుతూండాలి. అట్టి నీళ్లతోనే స్నానం చేస్తుండాలి

**అపథ్యములు :—** ఆలస్యంగా జీర్ణమయేపదార్థాలు., శ్లేష్మవృద్ధికర పదార్థాలు, పైత్యం, కాక చేసే పదార్థాలు తినకూడదు. గుమ్మడికాయ కూర, పనసకాయకూర, కంద మొదలగు దుంపకూరలు పథ్యములలో చెప్పినవి కాక తదితర ఆకుకూరలు తిన కూడదు. ఎక్కువగా ఉప్పు, కారం, పులుపు గల పదార్థాలు తినకూడదు. బెల్లం, పంచదార, తినడం మానెయ్యాలి. చెరుకుపానకం, త్రాగ కూడదు. ఇంగువ వేసిన పదార్థాలు తినకూడదు. వెల్లుల్లిపాయలు తినకూడదు. నువ్వులతో చేసే పదార్థాలు తినకూడదు. మానె పిండివంటలు, నెయ్యి, పాలు, పెరుగు, పనసతొనలు, ఆవకాయ, ఆకుకూరలు యివన్నీ యీవ్యాధి గల వారికి అపథ్యములే. ఈ వ్యాధి గలవారు కల్లు, సారా, బ్రాంది, మొదలగు మత్తు పానీయములు త్రాగ కూడదు. విస్తారంగా నీరు త్రాగకూడదు రాత్రివేళ మేల్కొనకూడదు. అతిగా నిద్ర పోకూడదు. సోమరిగా ఏ పనీ పాటూలేకుండా కూర్చోకూడదు. మైధునం రోగం తగ్గేటంతవరకూ మానెయ్యడం శ్రేయస్కరం. ఎండలో ఎక్కువసేపు నడవ కూడదు. ఆకలి ఆపకూడదు.

సేకరణ: అకుండి నారాయణమూర్తి

గడ్డను కరిగించివేసాయి. నేను క్రమంగా కరిగి నీరైపోయాను.

*　*　*

హాస్పటల్‌నుంచి డిస్చార్జి అయి ఇంటికి వచ్చి మూడురోజులయింది. తలమీద గాయం బాగా మానుపట్టింది. లేచి తిరిగి నా పనులు నేను చేసుకునే స్థితికి వచ్చాను. అనేకమంది వచ్చి నన్ను కుశలప్రశ్నలువేసి సానుభూతి చూపటం జరిగింది. అయినా ఈవ్యధ తీరేది కాదుకదా!

మనస్సు బరువెక్కినప్పుడల్లా పాపాయి ఆటలు చూస్తూ అబోసి నవ్వులతో కాలక్షేపం చేయసాగాను. నన్నెవ్వరూ పలకరించ లేరు. నేను నోరువిప్పి ఏదీ చెప్పకోలేను. అందరి హృదయాల్లోనూ భయం, బాధ కరడు గట్టుకు పోయాయి.

మాధవి వస్తుంది. తాను పాపాయి గురించే ఏవో కబుర్లు చెప్తుంది. నాతో ఏదో మాట్లాడాలను కుంటుంది. ఆఖరికి నిరాశతో వెళ్ళిపోతుంది. పరోక్షంగా ఆమె ఉనికి ఎంత ఓదార్పునిస్తున్నా ఎదురుగా ఆమెను దేని గురించి అడగలేకపోయాను. ఎన్నో చెప్పాలని ఆమె దగ్గరకు వచ్చేది. నేను కళ్లెత్తి ఆమెవైపు చూసేసరికి బిత్తరపోయి వెనక్కి తగ్గిపోయేది. ఆమెపడే ఆవేదనకు అంతులేదు, స్నేహితురాలికోసం తన జీవితంలో జరగబోయే ముఖ్య శుభ కార్యాన్నికూడా వాయిదా వేసిన త్యాగశీలి ఆమె—నాపెళ్లి ముచ్చట్లు చూడాలని ఎంత ఉవ్విళ్లూరిందని? పాపం, తన పరిహాసాల తలచుకొని తనమూలానే ఎంత బాధపడవలసి వచ్చిందని నిందించుకునేది! జాలితో నా మనస్సు కరిగి నీరైపోయేది.

ఆఖరికి నేనే ఒకనాటి మధ్యాహ్నం గొంతు పెగల్చుకున్నాను. 'మధూ! బాబయ్యగారు మళ్ళీ ముహూర్తం పెట్టించారా?...'

తల దించుకుంది మాధవి. 'లేదు. నేనే వద్దన్నాను.'

'ఏం!'

'నీ పెళ్లి జరిగేవరకు ఆమాట తలపెట్ట వద్దని చెప్పాను.'

'పిచ్చిదానా! నాకింక పెళ్లేమిటి! జరుగవల్సిందేదో ఎప్పుడో జరిగిపోయింది.'

'ఏమిటి జరిగిపోయింది ? ఏమీ జరగ లేదు...జరగవల్సిందంతా ఇక ముందే ఉంది...'

నేను పిచ్చిగా నవ్వాలనుకున్నాను. ప్రయత్నించి ఓడిపోయాను. 'లేదు మధూ! ఆయనకి మాత్రమే ఈ జీవితాన్ని అంకితం చేసాము. లేనినాడు నాకీజీవితమూ అక్కర్లేదు...'

'నీకు అక్కర్లేకపోయినా మాకందరకి కావాలి అనూ! జీవితంలో కలిగే మధురానుభవాల్లో కొన్నే మనకు అనుభూతులుగా మిగిలేవని, అటువంటి అనుభూతులు కొన్ని జీవితాంతం మనస్సునత్తె జపరుస్తూ ఉండా లంటే మనకోరికలు కొన్ని తీరవని... నువ్వొకసారి అనలేదూ!'

'నామాట నాకే అప్పగించా లనుకుంటున్నావా ?'

'లేదు. నువ్వు చెప్పిన నిజాన్ని నీకు గుర్తు చేస్తున్నాను.'

'అయితే, నేను ఓడిపోయావని ఒప్పుకుంటాను మధూ!'

'నీ ఓటమికాదు నాకు కావల్సింది అనూ! నీకు శుభం, ఆయనకు శాంతి కలగాలని నా ఆవేదన. ఆయన కోరిక ఏమిటో నీకు తెలుసుగా!'

'తెలుసు.'

'అయితే ఆయన్ని బాధపెడతావా ?'

నా మనస్సు వికలమైపోయింది. 'ఇందర్ని కష్టబెట్టి నేను బ్రతక్కపోతేనేం ?...'

'ఛ! ఏమిటామాటలు ? ఎవరి జీవితమైనా వాళ్ళకంటె వాళ్ళనాశ్రయించుకున్న వారికి ముఖ్యమైనపుడు ఆ జీవితం అందరికీ అతిముఖ్యమవుతుంది ... ఆ రాధ్యనీయమవుతుంది...'

'ఇంత అవమానం జరిగాక...'

'ఇప్పుడేం జరిగిందని?'








'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి.' ఆంధ్ర పత్రిక వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయగోరుచున్నాము. — సం॥



# రాగధార

'నాన్నగారికిదెంత దెబ్బో నీకు తెలియదా మధూ! కూతురి పెళ్ళి ఆగిపోయి నలుగురి నోళ్ళల్లోను పడ్డాక ఇంతకంటె వేరే అవమనమేమిటి?'

'నిజానిజాలు తెలియని వాళ్ళు ఏన్నో అనుకుంటారు. దానికి మనం బాధపడట మెందుకు?'

'ఇతరుల మాటలెలా ఉన్నా మనబాధ మనకు తప్పలేదు కదా!'

'అన్నయ్య చెప్పి వెళ్ళి ఉంటే ఈబాధా ఉండేదికాదు, దురదృష్టంకొద్దీ ఆయన వెళ్ళిపోవటం మేమెవ్వరమూ గుర్తించలేదు. ఇలా హఠాత్తుగా ఆయన కనిపించక పోవటంతో మా ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. ఏదో అనుమానంగా తన జేబులు తడిమి చూసుకున్నారు వేణు. అందులో నీకు, వేణుకు అన్నయ్య వ్రాసిన ఉత్తరాలు బయటపడ్డాయి...అవి చదివేసరికి మాకు మతిపోయినట్లయింది. కొంత సేపటికి వేణు ఆలోచనలకోరూపం వచ్చింది. '...ఏది ఏమయినా మాధవ్‌ను తీసుకురాకుండా నా ముఖాన్ని రాధకు చూపలేను. మాధవీ! అంతవరకు ఆమెకీవిషయం తెలియకుండ ఆమె ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుతూండు' అని నాతో చెప్పి రాత్రికి రాత్రే ఇక్కడికివచ్చి నాన్నగారితో జరిగిన విషయం చెప్పి తెల్లవారేసరికి విశాఖపట్నం ప్రయాణమై వెళ్ళిపోయారు వేణు...'అని జరిగినదంతా వివరంగా చెప్పింది మధూ.

'వాళ్ళు వెళ్ళి పది రోజులు దాటింది... ఇక వాళ్ళు రారు.'

'వస్తారు. ఏదో ఒకనాటికి వస్తారు. కాని దానికి ముందు నీ మనస్సును నువ్వ సమాధాన పరచుకోవల్సివుంది.'

'సాధ్యంకాని పని చేయగలనని ఎలా చెప్ప గలను?'

'నిర్మలమైన నీ ప్రేమ నీకాగుండెధైర్యం ప్రసాదిస్తుంది అనూ! ఆయనకోరిక తీర్చిన తృప్తితో నీవ్యథలన్నీ మరుగున పడిపోతాయి. ఆ శుభఘడియకోసమే మేమంతా ఎదురు చూస్తున్నాము.'

'అయితే, నన్నేం చేయమంటావు మధూ!' పిచ్చిదానిలా ఆమెవైపు చూసాను.

ఒక్కక్షణం తటపటాయించింది మధూ! 'డాక్టరుకి...డాక్టరు వేణుకి నీహృదయంలో చోటివ్వాలి అనూ!' అంది ఆమె.

ఉలిక్కిపడ్డాను 'డాక్టరు వేణుకా?'

'అవును అన్నయ్య కోరికకూడ అదే! వేణుకి ఉత్తరంలో కూడ అదే విషయం వ్రాసారాయన పెద్దలందరికీ అతనిపై గౌరవముంది. నువ్వు ఒప్పుకుంటే అందరి మనస్సులు కుదుటపడతాయి...'

'నా హృదయంలో డాక్టరు వేణుకి ఎప్పుడూ చోటుంది మధూ! కాని, ఆయన్ని అభిమానించి గౌరవించినది ఒక సహోదరునిగా మాత్రమే! మొన్నటికిమొన్న ఆయన నెక్లేసు కానుకగా ఇస్తుంటే ఏమని అనుకున్నాము? అన్నయ్యా అని పిలుచుకున్న వ్యక్తిచేత మెడలో మంగళసూత్రం కట్టించుకోనా మధూ! ఇంతకంటె దురదృష్టం మరెక్కడయినా ఉంటుందా?'

'కాని...కాని అప్పటి పరిస్థితులు వేరు అనూ! పెళ్ళికిముందు అభిమానంతో ఒక అనుబంధాన్ని ఏర్పరచుకోవచ్చు. అది పెళ్ళితో మారకూడదా?...'

'అయితే, పెళ్ళికి ముందున్న అనుబంధాలతో పెళ్ళితర్వాత సంబంధం లేకుండా పోతుందా మధూ! నన్నొప్పించాలని నువ్వు సర్దిచెప్తున్నావే కాని...ఇది భరించగలిగేదనుకుంటున్నావా?'

'లేదు అనూ! వేరొక ధర్మాన్ని నీకు గుర్తు చేస్తున్నాను. దురదృష్ట వశాత్తు అన్నయ్యకీవిషయాలు తెలియవు. భవిష్యత్తులో నువ్వు బాధపడకూడదని నీ సుఖం కోరి ఈకోరిక కోరారు ఆయన. ఈ చిక్కునుంచి తప్పించుకోవాలంటే ఆయన్ని మనం కలుసుకోవాలి. ఆయన రావాలంటే వేణుని నువ్వు పెళ్ళాడటానికి ఒప్పుకున్నట్లు ఆయనకు తెలియజేయాలి ఆయన వస్తేకాని వేణురారు. మరి నన్నేం చేయమంటావు చెప్పు!'

నేను కొంతసేపటివరకు మాట్లాడలేను. నేను కళ్ళెత్తి చూసేసరికి ఆతృతగా నా కళ్ళల్లోకి చూస్తూ కనిపించింది మాధవి

'సరే, రాధ పెళ్ళికి ఒప్పుకుందని ఉత్తరం వ్రాయి మధూ!'

మాధవి సాశ్చర్యంగా అంది, 'నిజంగానా అనూ!'

'ఆ! ఆయనకోసం...ఆయన తృప్తి కోసం ఏంచేయటానికైనా నేను సిద్ధమవుతున్నాను మధూ! కాని, డాక్టరు వేణుని మీరంతా ఇంకా అపార్థం చేసుకుంటూనే ఉన్నారు, అదే నాకు బాధగా ఉంది...'

'మస్త్వేది...'

'...అర్థం కానట్లుగానె ఉంటుంది మధూ! నీకు, ఆయనకు మా జీవితాలు స్థిరపడటమే కావాలి. మేము పెళ్లిచేసుకొని మీ కోరికలు తీర్చిన తృప్తిని మీకివ్వాలి. అంతేగాని మీ అనురాగపు సంకెళ్ళల్లో బంధింపబడినందుకు ఆపైన మేమెంతగా మానసిక వ్యధకు గురికావలసి వస్తుందో మీకక్కర్లేదు...'

'అనూ!...'

అంత బాధలోకూడ మనస్సు విప్పి చెప్పుకునేసరికి నాకు కొంత ఊరట కలిగింది: 'మీరేమీ బాధపడకు మాధవీ!... ముందు నేను చెప్పిన ప్రకారం ఉత్తరం వ్రాయి. ఆ తర్వాత ఏది జరగవలసి ఉంటే అదే జరుగుతుంది' అన్నాను మాధవి దిగులుగా నావైపు చూసింది. నేను తల త్రిప్పుకున్నాను. (ఇంకా వుంది)

ఇలాగా మాట్లాడే అతన్ని చూస్తే పద్మా వతికి జాలేసింది.

'చక్కగా ఈ ఊళ్ళో ప్రాక్టీసు పెట్టుకో కూడదు నాయనా. రెండుచేతులా సంపా దించవచ్చు!' అందావిడ,

'చెప్పా కదండి, నా ఉద్దేశ్యంకూడా అదే. ఇప్పటిదాకా నాకు 'నా' అన్నవాళ్లు మా అక్కయ్య బావే! వాళ్ళెంతగా విసు క్కున్నా అందుకే వస్తుంటాను — ఏటా కాకపోయినా రెండేళ్ళకయినా. నాకూ ఈ జీవితం చిరాగ్గా ఉంది. నాతోటివాళ్ళంతా కార్లలో తిరుగుతున్నారు. ఇక లేచ్చుకుని స్థిరపడాలి. ఏం విజయా?'

సిగ్గుపడింది విజయ.

'కాఫీ తెస్తానుండండి' అంటూనే లోపలికి వెళ్ళిపోయింది పద్మావతి. గదిలో జేరిపోతున్నట్లనిపించింది ఆవిడకి వాళ్లని చూస్తే!

'సినిమాకి రమ్మంటున్నారాయన' అంది లోపలికివచ్చి సిగ్గుపడుతూ విజయ.

'వెళ్లమ్మా దానికేం'

'నాన్నగారు ఏమయినా అంటారేమోనే!'

'నీ ముఖం. చెప్పారుగా తన అభిప్రాయం. మవ్వెళ్లు నీకెందుకు'

ఒకే రిక్షా ఎక్కి వాళ్ళు వెళ్లిన దిక్కే చూసి ముచ్చటపడుతూ నిలబడిన పద్మా వతికి వెంకటావు బుజంమీద తట్ట టంతో స్పృహవచ్చింది. 'అదేమిటే వాళ్ల నిద్దరినే అలా పంపావు నీకసలు బుద్ధి ఉందా?' అనడిగాడాయన.

నవ్వేసింది పద్మావతి 'బంగారంలాంటి కుర్రాడు. మీరూరుకోండి, నాకూ ఆ మాత్రం బాధ్యత తెలుసు. కాబోయే అల్లుడు తెలుసా?'

'ఛ, ఛ, నాకేం బాగాలేదు ఈపద్ధతి'

'సరేగాని పదండి, అలా గుళ్ళోకి వెళ్దాం. చాలాకాలం అయింది'

'మొక్కులా?'

'నిజంగానే, దేముడికేమిచ్చినా ఋణం తీర్చుకోలేం తెలుసా? ... మీ రతనితో మాట్లాడలేదుగాని, పసిపిల్లాడిలాంటివాడు. మనమ్మాయి అతని కంటికి దేవతే! అతని చూపు దానిమీదనుంచి క్షణంకూడా ఇవతలికి రాదు. అదృష్టవంతురాలు!'

'అయితే మనక్షింతకీ దేముడికెంత బాకీ — అది చెప్పవేం?'

# పద్మవ్యూహం

( 16వ పేజీ తరువాయి )

'అంతా చిత్రమండి మీదీ! పదండి పదండి'

దేవాలయంకి వెళ్లేదారిలో బట్టల కొట్లోంచి వస్తూ ఉమ అగపడింది పద్మావతికి.

'విజయ ఏదండీ, మీరిద్దరే వెడుతు న్నారు' అంది దగ్గరకొచ్చి.

'ఆ, ఎక్కడికో వెళ్ళిందమ్మా'

'ఆవిడవంక చూసి నవ్వింది ఉమ. పద్మావతికి చిరాకేసింది. కదలబోతుండగా ఉమ వాళ్ళ అమ్మ, నాన్నగారు, పార్వతి వచ్చారు ఎదురు. రావడం రావడమే 'వదిన గారూ, ఒక్కసారిలా రండి' అని కొంచెం అవతలికి తీసుకువెళ్లి 'చూడండి, నాకు వాడు తమ్ముడే అయినా మీరూ కావలసిన వాళ్లు కనుక వాడి గురించి నిజం చెప్పడం నా ధర్మం. వాడు చదువుకున్నాడన్నమాటే కాని చాలా దుర్మార్గుడండి! తేనెపూసిన కత్తి. చాలా విషయాలు స్వయంగా ఎరుగున్నదాన్ని కనుక చెబుతున్నాను' అంది.

పద్మావతికి జానకిరాం చెప్పిన మాటలు గుర్తొచ్చి నవ్వొచ్చింది. తను చెప్పిన విషయానికి పద్మావతి నవ్వేసరికి చిన్న బుచ్చుకుని 'మరి నే వస్తాను వదినగారు, హెచ్చరించలేదని అనుకోకండి. తరువాత చేతులు కాలాక ప్రయోజనం ఉండదు' అని విసురుగా వెళ్ళిపోయిందావిడ.

భర్త కోసం చూస్తే ఆయన ఉమ వాళ్ళ తండ్రితో మాట్లాడి వస్తుండగా కనబడింది పద్మావతికి.

'చూశావా పద్మా, నామాట చెవికెక్క లేదు నీకు!' అన్నాడాయన వస్తూనే.

నవ్వుతూ 'బావమరిది రాక్షసుడు అని చెప్పాడు కదూ ఆయన' అనడిగింది పద్మా వతి.

ఆశ్చర్యపోయాడాయన 'అక్షరాలా! ఎలా తెలుసు నీకు?'

'మరి ఇంట్లోకి ఎందుకు రానిస్తున్నార్ట అటువంటి రాక్షసుడిని?'

'అదే అడిగాను. ఇల్లు అతనిదేట! అతని తండ్రి ఆస్తన్నమాట. అందులో వీళ్ళు ఊరికినే ఉంటున్నారు. కనుక అతనొస్తే కాదనలేరు, కాదంటే వీళ్లనే బయటికి పొమ్మంటాడు!'

'తనగురించి అంత ఎక్కువ ప్రచారం చేస్తున్నారని తెలిసి కూడా వాళ్ళని ఇంట్లో ఊరికే ఉండనిస్తున్నాడంటే అత నెంత మంచివాడో చూడండి ... కడుపు మంట.'

'అదికాదు పద్మా, ఆయన చాలా పెద్ద మనిషి. అటువంటివాడు తప్పుగా ఎందుకు చెబుతాడు. అందునా సాక్షాత్తు బావ మరిదిమీద— చాలా భయంకరమైన విష యాలు చెప్పాడు!'

'మీరు మరీ ఇంత అమాయకపు మనిషేమిటండి? వాళ్ళకిద్దరు ఆడపిల్లలు పెళ్లకి మళ్ళే ఎదిగొస్తున్నారన్న విషయం తెలుసు కదా! ఆయనకి ఆస్తి లేదు. ఉంటున్న ఇల్లుకూడా అతని దయా దాక్షిణ్యాలమీద ఉండవలసినదే తప్ప స్వంతం కాదు. ఉద్యోగం అంటారా మామూలు జీతం! పైగా ఆయన సంపాదించేదానిలో ఎక్కువభాగం తల్లీకూతుళ్ళ ముస్తాబులకే అయిపోతుంది!... జానకిరాం వచ్చిన రెండు నెలలూ వాళ్ళకి పండగలాగా జరిగి పోతుంది!

ఇద్దరిలో ఒకర్ని చేసుకుంటాడని ఆశ వాళ్ళకి! దానికి పరిస్థితికూడా అనుకూలం గానే ఉంది. పది నెలలపాటు మన ప్రాంతంతో సంబంధంలేకుండా ఎక్కడో పడుంటాడు. ఇక్కడుండే ఈ రెండు నెలలూ అతని జోలికి ఎవ్వరూ రాకుండా కాపలాకాస్తే సరిపోయె! వాళ్ళ ఖర్మకాలి మన విజ్జి అతనికంట పడింది! మనకి అల వాటుపడి తెలీదు కానండి మన విజయది కాస్తోకూస్తో అందం అనుకుంటున్నా రేమిటి?'

'తల్లి పోలిక కనుకనా!'

నవ్వింది పద్మావతి. 'ఏమన్నా అను కోండి. విజయంటేమాత్రం అతనికి విపరీత మయిన ఇష్టం! అది పడగొట్టాలని వాళ్ళ ప్రయత్నం. అతన్నేమీ అనలేరు కనుక మనకి అతనంటే అసహ్యం కలి గించాలని చేస్తున్నారిదంతా ... పదండి పదండి.'

ఆ రెండునెలలకాలం రెండుక్షణాల్లా మధురమయిన కలలా గడిచిపోయింది విజ యకి. జానకిరాం విజయని తిప్పని ప్రదేశం లేదా ఊరిలో! ఇద్దరూ కలిసి వెళ్ళని

హోటలు లేదు. చూడని సినిమా లేదు. అంతవరకూ పద్మావతికి తెలుసు కూతురు ద్వారా!

కాని కూతురు చెప్పని విషయాలు చాలా ఉన్నాయని ఆమెకి తెలియదు. అందులో ఒకటి వాళ్ళిద్దరూ చాలాసార్లు సినిమాకి వెళ్ళామని అబద్ధాలాడారన్నది! అది మధురమయిన అనుభవం విజయకి!

జానకిరాంకి శలవయిపోయి వెడుతూ వెడుతూ మరీ మరీ చెప్పాడు విజయకి 'మీ నాన్నగారికి చెప్పు విజయా, మంచి ముహూర్తం చూసి నాకు ఉత్తరం రాయమను. అడ్రసు రాసుకున్నావుగా! ఒక పదిహేనురోజులు ముందుగా ఉత్తరం రాయాలి గుర్తుంచుకో.' మా అక్కయ్యా వాళ్ళు తప్ప నాకు 'నా' అన్న వాళ్ళెవరూ లేరని చెప్పాగా! మన పెళ్ళి గురించి వాళ్ళకెంత కోపంగా ఉందో కూడా తెలుసుగా. కనుక ఎవ్వరినీ సంప్రదించవలసిన పని లేదు– రెండువైపులా మీనాన్నగారే పెద్ద!

నాకు ఇంక ఉద్యోగం చేయాలని లేదు. ప్రాక్టీసు పెట్టుకుందాం. వచ్చినంత వస్తుంది. మనిల్లు ఉండనే ఉంది. ఏమంటావోయ్.'

'మీ ఇష్టం.'

జానకిరాం వెళ్ళిపోయిన తరవాత వెంకట్రావుకి చెప్పింది పద్మావతి కూతురు తనకి చెప్పిన విషయాలు. చాలా ఆనందపడ్డారాయన.

'చూశావా, భయపడ్డావు దేనికినే! డాక్టర్ని అప్పనంగా కొట్టేశావు అల్లుడుగా! మీరే కాదు లోకరీతే అంత. మంచి ధర పలికే కుర్రాడు ఊరికే పెళ్ళిచేసుకుంటానంటే ఒక పట్టాన నమ్మలేము. 'వాడిలో ఏదో లోపం లేకపోతే ఇంత త్యాగం ఎందుకు చేస్తాడు' అన్న అనుమానం కలుగుతుంది. ఒకరకమయిన జీవితానికి అలవాటు పడిపోయి 'మంచి' అన్నది ఎరక్కుండా ఉన్న వాళ్ళకి ఒక్కసారిగా అతిమంచితనం ఎదురయినా కష్టమే!

వెంకట్రావుగారు నవ్వేశాడు 'గెలిచావు కనుక ఎన్నయినా చెపుతావు.'

'అవునండి నలుగురిలో తిరక్క మీకు లోకరీతి తెలియడంలేదు. అతి ఆశఉన్న వాళ్ళెలా ఈ రోజుల్లోనే ఉన్నారు. మనస్సుకి నచ్చితే ఉభయఖర్చులూ భరించి పెళ్ళిచేసుకునే వారూ ఈ రోజుల్లోనే ఉన్నారు. 'ఇది ఒక వైభవోజ్వల మహా యుగం. వల్లకాటి అధ్వాన్నశకం. వెల్లివిరిసిన విజ్ఞానం. బ్రహ్మాండమైన అజ్ఞానం.'

'కవిత్వం చెబుతున్నావేమిటోయ్?'

'నాది కాదులెండి ఒక మహానుభావుడు రాసినది.'

'ఎవరేమిటి?'

'అదేమరి — మీకీరోజుల్లోను, ఇప్పటి వాతావరణంతోనూ పరిచయం లేదనేది... సరేగాని ముందు ముహూర్తం పెట్టించండి.'

ముహూర్తం పెట్టించి వెంకట్రావు రాసిన ఉత్తరం తిరిగి వచ్చేసింది. 'అడ్రసు పొరపాటు రాసిఉంటాను' అని సర్దుకుని మళ్ళీ విజయచేత అడ్రసు రాయించి మరీ పోస్టు చేశాడాయన జానకిరాంకి!

అది కూడా సక్రమంగా తిరిగి వచ్చేసింది! ఖంగారుపడ్డారు ముగ్గురూ!

'ఏమయి ఉంటుంది' అని ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు.

'బహుశ అనుకోకుండా అడ్రసు మారి ఉంటుంది' అంది పద్మావతి.

'అయితే ఆ విషయం తెలియపరిచేవారేగా' అంది విజయ.

'పోయిందేముంది నువ్వువెళ్ళి నీస్నేహితురాలు ఉమా వాళ్ళఇంట్లో కనుక్కుని రామ్మా వాళ్ళకి తెలిసే ఉంటుందిగా!'

'నే వెళ్ళను బాబూ — అసలే వాళ్ళకి నేనంటే అదోలాఉంది.'

'పోనీ నువ్వెళ్ళి ఆవిడ్ని అడిగిరావే.'

'నేనూ వెళ్ళనండి. మీరు ఆఫీసులో ఆయన్ని కలుసుకునిరండి ఏ గొడవా ఉండదు. మా ఆడవాళ్ళ విషయం తెలియనిదేముంది? రకరకాల వ్యాఖ్యానాలు వస్తాయి.'

ఆయన వెళ్ళి సాయంత్రం తిరిగి వచ్చేవరకు ఇద్దరూ ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకు కూర్చున్నారు. బయటపడకపోయినా ఇద్దరికీ ఒకేరకం భయం మనస్సులో ఉండిపోయింది!

తిరిగి వచ్చిన తండ్రి ముఖం చూస్తూనే నీరసపోయింది విజయ. ఏడుపు ముంచుకొచ్చేసింది అమ్మాయికి.

'ఏమన్నారండి?' అనడిగింది భయపడుతూనే పద్మావతి.

'గుండెపగిలి చస్తారు చెబితే.'

'సర్లెండి. విషయమేమిటో చెప్పకూడదూ?'

'అసలా అబ్బాయి ఇంతవరకూ ఎవ్వరికీ అడ్రసు ఇవ్వడం అన్నది జరగలేదుట!

వాళ్ళ బావ వాళ్ళకి అతని చిరునామా ఇవ్వడూ తెలియదుట. పదినెలలపాటు ఎక్కడున్నాడో తెలియకుండా ఈ రెండు నెలలా మాత్రం హఠాత్తుగా ఊడిపడ తాడుట. పైగా ఆయన ఏమన్నాడో తెలుసా 'మేమందరం చెప్పిన మాటలు లక్ష్య పెట్టలేదండి మీరు, మేమేదో పోటీకివచ్చి అలా చెబుతున్నామని అనుకుని ఉంటారు. అదేఖర్మ — వాడు అతి తెలివి గలవాడు. అలా చెప్పగలడుకూడా! ఎప్పుడూ జరిగే భాగవతమేనండి ఇది. వస్తాడు ఎక్కడోక్కడ కొంపలంటించి పోతాడు. దుర్మార్గుడండి వాడు' అని.

'అవుతే అంతా నిజమేనా ఏమిటండి కొంపదీసి.'

'విను ఇంకా అవలేదు — పూర్తిగా విని మరీ ఖంగారుపడు. వాళ్ళ అమ్మాయి లిద్దరూ విజయకి అడుగడుగునా కాపలా ఉన్నారుట. ఇక లాభంలేదు ఈ అమ్మాయిని తన ఆకర్షణలో పడేశాడు అని వాళ్ళకి అనుమానం వచ్చాక దాన్ని హెచ్చరించారుట కూడా. ఏమే అమ్మాయ్, నిజమేనా ఆయన చెప్పినది?'

విజయ మాట్లాడలేదు. కాని ఆ అమ్మాయికి అంతా గుర్తుకొచ్చింది— మాట్లాడితే ఉమ, పార్వతి అడ్డురావడం పరుగుడు చెట్ల తోటలోకి పార్వతి పరు గెత్తుకుంటూ వచ్చి అతన్ని బంతి పెట్టి కొట్టడం, మేడమీదికి పార్వతిని ఉమ పంపడం తరవాత ఉమ తనతో జానకిరాం గురించి చెప్పడం!

పద్మావతి అవాక్కయిపోయింది.

చివరికి విజయే అంది 'డాక్టరు భాస్కర్ ఆయనకి చాలా మంచి స్నేహితుడు నాన్న గారూ. ఆయన్నడుగుతే!' అని.

ఆయనకి ఉవ్వెత్తున కోపం వచ్చేసింది 'సిగ్గు లేక ఏమని అడగమంటావే?'

పద్మావతి అడ్డం పడింది. 'అలా బాధపడటాలెందుకు. పోయిందేముంది — మన అదృష్టం బాగుంటే ఆయనకి తెలియచ్చు కూడా!'

'అవునే తనకి తప్పేదు అడుగు వచ్చి పోయాడంటే అర్థమేమిటంటావు?'

'ఒక్కసారి వెళ్ళిరండి [illegible] అక్కడికి అనుమానం తీరిపోతుంది.'

# పద్మవ్యూహం

మర్నాడు డాక్టర్ భాస్కరరావు ఇంటికి వెళ్ళాడాయన.

విషయం విని నవ్వాడతను. 'అదేనండి మా జానకిరాముడితో బాధ! వాడు మగ వాళ్ళకి చాలా మంచి స్నేహితుడు, ఆడ వాళ్ళకిమాత్రం కాదు'

'అంటే.'

'నేను వాడికి చాలాసార్లు చెప్పానండి. 'ఆడపిల్లల జీవితాలతో ఆడకుడా జోలికి రావుడూ. తప్పది. వాళ్ళే అఘాయిత్యం చేసినా ఆ పాపం నీ మెడకు చుట్టు కుంటుంది' అని ... వాడిటుకేసి ఎప్పు డొచ్చినా ఇదే భాగవతమనుకోండి.'

అతను చెప్పేది పూర్తిగా బోధపడలే దాయనకి. అర్థమయినంతవరకు విపరీత మయిన ఖంగారుని కలిగించింది.

మళ్ళా డాక్టరుగారే అన్నాడు. 'వాడి అడ్రసు నాక్కూడుకదా దేముడిక్కూడా ఇవ్వడు వాడు. ఇచ్చాడంటే అనుమానం లేకుండా తప్పు అడ్రసయుంటుంది!... వచ్చి నప్పుడు చూడాలిసిందే మనం వాడిని. వాడికి ప్రాణస్నేహితుడ్ని కావటాన వాడు చేసిపోయిన తప్పులకి కొంతవరకు చికిత్స చేస్తుంటాను' అని మెల్లిగా 'ఏమయినా అవసరం అయితే నేనున్నాను ఐ విల్ హెల్ప్ యు' అన్నాడు.

'అంటే' అన్నాడాయన అర్థంకాక.

'పెద్దవారు, మీ కిటువంటివి చెప్ప కూడదు. అమ్మాయి ఏమయినా తొందర పడి ఏదయినా జరగకూడనిది జరిగిఉంటే మీకు సాయం చేసేందుకు నేనున్నాను. రెండవ కంటివాడికి తెలియనివ్వను.'

అర్థం అయిందాయనకి. 'అబ్బెబ్బె, అటువంటిదేమి లేదు లెండి' అన్నాడు కంగారుగా.

'అదృష్టవంతులం. ఆ వెధవకి స్నేహి తుడినయిన పాపానికి ఇటువంటివి తప్పవు నాకు. అయితే ఇంకేమండి—వాడినిక మర్చి పొమ్మనండి! ఉత్తమమయిన మార్గం అది.'

ఇంటికివచ్చిన తండ్రి చెప్పినదంతా విని బావురుమని ఏడవడం మొదలెట్టింది విజయ.

పద్మావతి కూడా కుప్పకూలిపోయింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయావిడకి.

'ఎందుకే అంతగా ఇదవుతారు. అదృష్ట వంతులం మనమింకా — అటువంటివాడిని అల్లుడ్ని చేసుకుంటే జీవితమంతా వాన్ని చూసి ఏడవాలసి వచ్చేది... ఎందుకే ఏడు స్తారు. ఇప్పుడేం జరిగిందని, వాడ్ని మర్చిపోయి మన ప్రయత్నాలు మనం చేసు కుందాం.

'జరక్కూడనిదే జరిగిందండి బాబూ. ఇప్పుడు కొంప మునిగేలా ఉంది' అంది పద్మావతి.

ఈడ్చి కొట్టినట్లుయిందాయనకి. 'ఏమిటి నిజంగానే!'

'ఆ అదేగా నా బాధ.'

'చదువుకున్నది, లోకం తెలిసినది, దీని బుద్ధేమయిపోయింది?'

'ఖర్మ'

ఆయన కాసేపు మాట్లాడకుండా వాళ్ళిద్దరిని చూస్తూండిపోయాడు చివరికి 'పద్మావతీ, తప్పంతా నీదేనే అసలు' అన్నాడు.

ఆవిడ మాట్లాడలేదు.

'పద్మవ్యూహంలోకి వెళ్ళడం మాత్రమే నేర్పావు దానికి. తెలివితేటలుపయోగించి తిరిగి రావడం నేర్పలేకపోయావు. అభి మన్యుడిలా అయింది దానిపనికూడా!'

'సర్లెండి. మనం పడుతున్న ఈ అను మానం ఊళ్ళోవారంతా వచ్చి నిజం అని చెప్పకముందే మేల్కొని దానికి మూడు ముళ్ళూ వేయించాలి ... మీ మేనల్లుడికి రాయండి.'

'ఛ ఛ గుమాస్తా ఉద్యోగమేగా!'

'పోనీ నా తమ్ముడున్నాడు.'

'వాడూ గుమాస్తాగా కాకపోతే బ్యాంకులో!'

'చచ్చిన పాముని చంపకండి మహాను భావా — మా తమ్ముడు కాకపోతే మా చిరంజీవి! వాడూ కాకపోతే ఎవడో ఒకడు ముందు పిలిపించండి బాబూ, ఆలస్య మయినకొద్దీ కొంపలంటుకుపోతాయి' అంది పద్మావతి కళ్ళు తుడుచుకుని.

(అయిపోయింది) ●

# ఒక వారం విపరీతం

## ఫాలాక్షుడు

### పతికి విషం పెట్టిన పడతి!

✸ ఖర్గపూరుకు 3 కిలోమీటర్ల దూరంలో వున్న చక గణేశ్ అనే వూరిలో 25 ఏళ్ళ వో అమ్మాయి తన పతి దేవునికి విషం పెట్టిందట. ఆ విషం ఆతనికి సరిగా పని చేయలేదట. దాంతో ఆమెకు మార్గాంతరం తోచక, వో పటకా కత్తితో (మొన్న 5 వ తేదీన) ఆతని శిరస్సును తెగనరికి పారేసిందట.

### విద్యుత్ ప్రమాదాలు

వేలాంపాళాయానికి చెందిన 28 ఏళ్ళ ఆరుముగం అనే అతను తిరుప్పూరు బట్టల మిల్లులో పని చేస్తున్నాడట. ఈతనికి రెండు నెలల క్రితమే వివాహమయ్యిందట. డ్యూటీ ముగించుకుని, యింటికి వస్తూ దారిలో వో లాంతరు స్తంభం మీద యాథాలాపంగా చేయివేశాడట. దురదృష్టవశాత్తూ ఆ స్తంభంలో అధిక శక్తితో విద్యుత్తు ప్రవహిస్తూ వుండడంవల్ల కాలి చనిపోయాడట.




### గురువుగారి సలహా—కుమారుని బలి!

కటక్‌లో పంచబెహెరా అనే ఆయన తన గురువుగారి సలహా మీద దుర్గఅమ్మవారికి తన పదకొండేళ్ళ కొడుకు సరత్‌ను బలి యివ్వడానికి జూన్ 29 వ తేదీన తన స్వగృహంలో సకల ఏర్పాటులూ చేసుకున్నాడట. కానీ దైవికంగా ఆ సరత్ చావు తప్పించుకుని, అంతకు తీసిపోని గాయాలతో బతికి బయట పడ్డాడట. అతని తండ్రినీ, ఆ తండ్రిగారి గురువుగారినీ చట్టం పట్టుంగా తీసుకున్నదట.

### కామోద్రేకంలో బాలికను హత్యచేసిన యువకుడు

పోయిన నవంబరు తొమ్మిదో తేదీన బ్యాంగ్‌కాక్‌లో 20 ఏళ్ళ సోమాచి తన్‌వోతా అనే యువకుడు కామోద్రేకంతో 11 ఏళ్ళ టున్‌నాగ్నుజ్ అనే అమ్మాయిని పట్టుకుని బలాత్కారంగా అనుభవించి, తత్సమయంలో ఆమె బాధతో కేకలు వేసేసరికి పీకనొక్కి చంపి, ఆనక ఆమె శవాన్ని వో ప్రవాహంలో విసరి చక్కా పోయాడట. ఈ విషయాన్ని కూపీ తీసిన చట్టం అతనికి మరణ శిక్ష విధించిందట.

* * *

ఢిల్లీ రాజౌరీగార్డెన్ ప్రాంతంలో రోడ్డు మీద పడున్న వో కరెంటు తీగమీద చూడకుండా కాలేసిన ఖర్మానికి 18 ఏళ్ళ రామ్‌సింగ్ అనే కుర్రాడు చని పోయాడట.

### 1971 లో జననష్టం

1971 వ సంవత్సరంలో భారతదేశంలోని అతివృష్టివల్ల, నదుల పొంగుదలలవల్ల సుమారు 57 మిలియనుల మంది జనులు చనిపోయారట. 1954 తర్వాత అంత మారణహోమం చేసిన వరద 1971 వ సంవత్సరమే అన్నారు.

### సింహాలకి కుటుంబ నియంత్రణ!

కాలిఫోర్నియా శాన్‌జోసే జంతు ప్రదర్శన శాలలోని వో ఎనిమిదేళ్ళ టామీ అనే సింహం ఐదు కాన్పులలో ఒక్కొక్క కాన్పుకూ నాలుగు నుంచి ఆరువరకు పిల్లలను కన్నదట. ఆ సింహం పెద్దకూతురు 'శ్రీ' కి యిప్పుడు గర్భధారణ వయస్సట. ఆ జంతు ప్రదర్శనశాలలో సింహరాజాల సంతతి పెద్దగాపోతున్నందువల్ల భయపడిన అధికారులు యీసారి టామీకి, శ్రీకి ఆహారంలో గర్భ నిరోధక మాత్రలు కలిపి యిస్తున్నారట. సింహాల మీద కుటుంబ నియంత్రణాలు అమలు జరపడం ప్రపంచంలో యిదే మొదటిసారిట.



### తనివితీరక...

న్యూయార్కులో 26 ఏళ్ళ ఇర్విన్ స్టేమన్ అనే వో యువకుడు యథేచ్ఛగా బజార్న పడి, దారిపోయే ఆడవాళ్ళ కన్నులు మూసి, వారి పెదవులను తనివి తీరా ముద్దెట్టుకోడమే. గత ఎనిమిది నెలలుగా కర్తవ్యంగా పెట్టుకున్నాడట. రాన్రానూ యీ రకం అధరామృతంతో తనివితీరక, వో స్థాయి ఎక్కించి కనబడిన ప్రతి ఆడవారి పెదిమలూ కనుక్కున కొరికేయడం ఆరంభించాడట. ఈ రకంగా ఆతను ముద్దు పెట్టుకున్న ఆడవారు కొందరు ఆతని రాక్షసకృత్యాన్ని పోలీసులకు తెలియజేశారట. ఆమట్నే పోలీసులు అతన్ని పట్టుకుని 'బహుశ యీతనికి పిచ్చేమో' అని ఆసుపత్రిలో చేర్పారట. పిచ్చేం రోగం.... జరుగుతే.... అన్న సామెత లేదూ!




### తలలు మార్చడం అసాధ్యం కాదు!

ఇటలీ ఫియగ్గోలో జరిగిన అంతర్జాతీయ శస్త్ర వైద్యుల మహాసభలలో మాట్లాడుతూ అవయవాల మార్పిడి చేసినట్టు, మానవుని తల కూడా మార్పిడి చేయవచ్చుననీ, యీ శస్త్ర చికిత్స కూడా సంభవమేననీ ప్రొఫెసరు వైట్ అన్నారట.

### ఇద్దరు పిల్లల్ని హత్యచేసి ఆత్మహత్య చేసుకున్న తల్లి

భవాని అనే వూరిలో 27 ఏళ్ళ [illegible] అనే ఆమె తన యిద్దరు పిల్లలని (5 ఏళ్ళు, 18 నెలలు) పీక నులిమి, [illegible] గిరాటేసి, ఆమె తాను కూడా [illegible] హత్య చేసుకున్నదట. తెల్లారి తన భార్యా [illegible] లలా కపబడలేదని ఆమె భర్త మునియప్పన్ పోలీసులకు చెప్పిస్తే, వారి శవాలను కనుగొన్నారట.

# పరిచయం



# విజయవంతమైన చిత్రాలనాయిక జయభాదురి

ఏదేమి మహాత్మ్యమో, జయభాదురి నటించిన చిత్రాలన్నీ విజయఢంకా మ్రోగిస్తున్నాయి. ఆమె నటించిన మొదటి చిత్రం 'గుడ్డీ' సంచలనాన్ని కలిగించింది. తర్వాత విడుదలైన 'ఉపహార్' ఢంకా బజాయించింది. ఇటీవల విడుదలైన 'అన్నదాత' అందరినీ ఆకర్షించింది.

## కళ్ళు నటిస్తాయి

ఈమెను గూర్చి ఒక్కమాటలో చెప్పాలంటే విజయానికి ప్రతిరూపం జయ అంటే సరిపోతుంది. ఈమె కళ్ళు నటిస్తాయి. నటనలో రజస్ వుంది. అరుపులు, ఒళ్ళు విరుపులు ఈమెకి చేతకాదు. సంభాషణలను సన్నివేశానుగుణంగా, ఉచ్చారణ చెయ్యగలదు. ఏ పాత్రలో చూసినా, జయ నటించినట్లు కనిపించదు. ఆ పాత్రగానే మారిపోతుంది.

## తండ్రియిచ్చిన స్వేచ్ఛ

నాకు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ఇచ్చిన తండ్రిగారిని ఏనాటికీ మరువలేను. నేను తీసుకునే నిర్ణయాలకు అడ్డు చెప్పరాయన. ఆయన ఆశీర్వాదమే నాకు శ్రీరామరక్ష, అంటుంది జయభాదురి.

ఇటీవల వచ్చిన కథానాయికల్లో జయభాదురికి వచ్చిన పేరు, ప్రశంసలు మరెవ్వరికీ రాలేదు. చేసుకున్నవాళ్ళకి చేసుకున్నంత రాజేష్‌ఖన్నాకు ఎంత పేరుందో, జయకు కూడా అంతవుంది.

## వెరైటీ పాత్రలు ...

'నాకు విభిన్న మనస్తత్వాలు కలిగిన పాత్రలను పోషించడం అంటే చాలా ఇష్టం. క్లిష్టమైన పాత్ర దొరికితే, దాని అంతు పట్టేంత వరకు నాకు నిద్ర రాదు' అంది హిందీ నటి జయభాదురి.

'నటన అంటే కథకుడు వ్రాసిన భావాలకు తగ్గట్లు ప్రవర్తించడమే. భావ ప్రకటనకు డైలాగు డెలివరీని టైం సెన్స్‌లో చెప్పడం చాలా అవసరం. పెదవులతో బాటు కళ్ళు కదిలితే కొన్ని సన్నివేశాలు బ్రహ్మాండంగా వస్తాయి' అని చెపుతోంది భాదురి.

## అభిమానవతి ...

'నన్ను ఎవరైనా కించపరిస్తే నాకు ఏడుపు ఆగదు. గంటల తరబడి ఏడుస్తాను. నాకు కావలసినవాళ్ళు ఏదయినా అంటే, ఆ రోజంతా నాకు నిద్రపట్టదు. నాకు సింపుల్‌గా వుండే మనుష్యులంటే ఎక్కువ గౌరవం. నాకు తీరిక వున్నప్పుడల్లా హాయిగా నిద్రపోతాను. మంచి మంచి పాటలను టేప్ మీద వింటాను. పార్టీలకు హాజరవడం అంటే నాకు అలర్జీ.

## అమితాబ్ స్నేహం ...

'నేను, అమితాబ్ బచన్ ప్రాణ స్నేహితులం. మా నటనలో కనిపించే లోపాలను గూర్చి తర్జన భర్జనలు చేసుకుంటాము. అతడి సలహాలను పాటిస్తాను.

'నాకంటే పొడవుగా వుండే వాళ్ళంటే నాకు అసూయ. (కారణం నేను పొట్టిగా బట్టి). ఆడవాళ్ళు ఎప్పుడూ నవ్వుతూ వుండాలన్నదే నా అభిమతం.' అంటారామె.

— శ్రీనివాస్

# సినిమా

## రాణీ మాలినీదేవిగా జమున

జయప్రదా పిక్చర్స్ నిర్మించిన రంగుల చిత్రం 'పండంటి కాపురం'లో రాణీ మాలినీదేవిగా జమున అపూర్వంగా నటించింది. ఇంతవరకు ఆమె చేసిన పాత్రలకి, దీనికి చాలా వ్యత్యాసం వుంది. కన్నకూతురి కోసం తపించే వనితగా, తన బ్రతుకును మోడుచేసిన వ్యక్తిపై పగబట్టిన యువతిగా జమున అద్భుతంగా నటించింది తెలుగులో మరెవ్వరూ యింతబాగా వెయ్యలేరేమో అన్న అభిప్రాయాన్ని యేర్పరచింది.

## వేషాలలో వైవిధ్యం

గత రెండు సంవత్సరాల్లో జమున ధరించినన్ని వైరైటీ పాత్రలను, మరెవ్వరూ వెయ్యలేదు. 'తాసిల్దారుగారి అమ్మాయి, సంపూర్ణ రామాయణం, కలెక్టర్ జానకి, మేనకోడలు, పండంటి కాపురం' చిత్రాలను తిలకించిన వాళ్లందరూ ఏకకంఠంతో తీర్పు నిచ్చారు. ఏమని? జమున అసాధారణ ప్రజ్ఞావంతురాలు అని.

ముమ్ముందు రాబోయే 'చింత దొంతులు డబ్బుకు లోకం దాసోహం, వామా మీసన్ చిత్రం' జమున ప్రేగును పెంచేవిగా వుంటాయి. రెండు దశాబ్దాలనుండి ఒక హీరోయిన్ పేరుతో వుండడం అంటే మాటలా? 'వుండగలను' అని జమున నిరూపించింది. ప్రజల్లో జమునకంటూ ఒక ప్రత్యేకస్థానం వుంది ఇచ్చిన ఏపాత్రకయినా జమున పరిపూర్ణన్యాయం చేకూరుస్తుంది

## ఉత్తమ నటుడ గా శోభన్ ఎన్నిక!

'తాసిల్దారుగారి అమ్మాయి' చిత్రంలో విశిష్టమైన నటన్ను అగుపరచినందుకు ఆంధ్రా ఫిలిమ్ క్రిటిక్స్ అసోసియేషన్ శోభన్‌బాబును ఉత్తమ నటుడిగా ఎన్నిక చేసిన విషయం పాఠకులకు తెలుసు.

ఇప్పుడు మద్రాస్ ఫిలిం ప్రేక్షక సంఘ సభ్యులు శోభన్‌బాబును 1971వ సంవత్సరపు ఉత్తమ తెలుగు నటుడిగా నిర్ణయించారు త్వరలో బహుమతీ ప్రదానం జరుగుతుంది. రోజురోజుకి బాధ్యత పెరుగుతూ వుంది, శోభన్‌కి. ప్రజలు తనకు ఆపాదిస్తున్న గౌరవాన్ని నిలుపుకునేందుకు శాయశక్తులా ప్రయత్నిస్తానని, తనమాటగా మీకు చెప్పుతున్నారు.



'బాల భారతం'లో చంద్రకళ, అంజలీదేవి, కాంతారావు.



'నిజం నిరూపిస్తా'లో కృష్ణ, విజయలలిత.



'మా యింటి వెలుగు'లో కృష్ణ, చంద్రకళ.

## బాపూ దర్శకత్వంలో అక్కినేని

'బుద్ధిమంతుడు' చిత్రాన్ని నిర్మించిన చిత్రకల్పన పతాన నవంబరులో కొత్త చిత్రాన్ని ప్రారంభిస్తారు. ముళ్ళపూడి వ్రాసిన కథకు, అక్కినేని నాయకుడు. దర్శకత్వం: బాపూ.

## సినిమా నందమూరి చిత్రం

'విజయం మనదే' కిలాడీ బుల్లోడు' చిత్రాలను నిర్మించారు, నందమూరి సాంబశివరావు. పై రెండు చిత్రాల్లో ఆశించినంత లాభాలు రాలేదు.

పాత చిత్రాలను కొని, వాటిద్వారా ఎక్కువ ప్రయోజనాన్ని పొందియున్నారు. 'నమ్మినబంటు' చిత్రం వీరిదే. ఆ చిత్రం ఎక్కడ విడుదలయినా, కనకవర్షం కురిపిస్తూ వుందట.

నవంబరు నుండి అక్కినేని నాగేశ్వరరావుతో కొత్త చిత్రాన్ని ప్రారంభించే ప్రయత్నాలను పూర్తి చేసినట్టు, యిటీవల నాతో చెప్పారు. మంచి మనస్సుతో బాటు మంచి చిత్రాలను తీయాలన్న ఆపేక్షవున్న నిర్మాతగా సాంబశివరావును పేర్కొనవచ్చు.

## 'బంగారు బాబు' 3 వ షెడ్యూలు

జగపతి ఆర్ట్సు పిక్చర్స్ ఈస్టమన్ కలర్‌లో నిర్మిస్తున్న 'బంగారుబాబు' చిత్రం మూడవ షెడ్యూలులో పడింది

మొదటి షెడ్యూలులో కోవలం బీచ్ వద్ద హెలికాప్టర్ ఫైటు దృశ్యం చిత్రీకరించబడింది రెండవ షెడ్యూలులో ఊటీ కూనూరు పరిసరప్రాంతాలలో అయిదు పాటలు, కొన్ని సన్నివేశాలు చిత్రీకరించబడ్డాయి.

జులై 22 నుండి 30 వరకు సారథి స్టుడియోలో ఇన్‌డోర్ సెట్లో పని ప్రారంభమవుతుంది ఈ షెడ్యూలులో నటీనటులందరూ పాల్గొంటార.

చిత్రం ప్రారంభమై రెండు మాసాలే అయింది. కానీ ప్రేక్షకుల మనస్సు యిప్పట్నుండే 'బంగారు బాబు' పై కేంద్రీకరించబడి వుంది ఈ చిత్రానికి కథ, సినిమా అనుకరణ, దర్శకత్వంను వి బి రాజేంద్ర ప్రసాద్ నిర్వహిస్తున్నారు. మాటలు-పాటలు: ఆచార్య ఆత్రేయ.

'బంగారుబాబు'గా నాగేశ్వరరావు నటిస్తున్న యీ ఈస్టమన్ కలర్ చిత్రానికి ఎస్. వెంకటరత్నం పెద్ద యస్సెట్. హీరోలకున్న పేరు, ప్రతిష్టలు వెంకటరత్నంకు వున్నాయి. అతని స్టైలులో ఏదో ప్రత్యేకత కనిపిస్తుంది, అంటారు జనం.

## 'వాణిశ్రీ—జయంతి'

ఈ చిత్రంలో అక్కినేనికి ప్రేయసిగా వాణిశ్రీ, సోదరిగా జయంతి నటిస్తున్నారు. చిత్రంలోని పాటల్లో ఒకదాన్ని మించి మరొకటి వుంది,(విన్నాను గాబట్టి.)ముఖ్య

←సి—72

## సినిమా డైరీ

● లక్ష్మి ఆర్ట్స్ వారి మూటంగు జూలై 17 న వీనస్‌లో ప్రారంభమైంది విశ్వనాథ స్విచ్ ఆన్ చెయ్యగా, త్రివిక్రమరావు క్లాప్ కొట్టారు. ఉతూరి సూర్యం దర్శకుడు.

● సురేష్ మూవీస్‌వారి 'జీవన తరంగాలు' జూలై 17 నుండి వాహినిలో ప్రారంభమైంది. తాతినేని రామారావు దర్శకుడు.

● ఎస్. వి. ఎస్. పిక్చర్స్‌వారి 'డబ్బుకు లోకం దాసోహం' జూలై 16 నుండి ప్రసాద్‌లో ప్రారంభమైంది డి. యోగానంద్ దర్శకుడు

● శశి ఆర్ట్స్‌వారి 'ప్రజా నాయకుడు' ఆగస్టు 4 న నవయుగా ద్వారా విడుదలవుతుంది. వి. మధుసూదనరావు దర్శకుడు

● నందిని పిలింస్‌వారి 'ఇల్లు—ఇల్లాలు' జూలై 19, 20 తేదీల్లో (అవుట్‌డోర్) జరిగింది పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు

● డి వి. ఎస్. ప్రొడక్షన్స్ అతి త్వరలో ఒక జానపదాన్ని ప్రారంభిస్తారు. సి. ఎస్. రావ్ దర్శకుడు.

పాత్రలను నాగభూషణం, రాజబాబు, రమాప్రభ పోషిస్తున్నారు. గెస్టుగా ఎస్వీ రంగారావు, గుమ్మడి కనిపిస్తారు. ఈ చిత్రాన్ని సంక్రాంతి నెలలో విడుదల చెయ్యాలని వుంది, అన్నారు దర్శక, నిర్మాత వి. బి. రాజేంద్రప్రసాద్.

వాణీ సంస్థకు 'అంతస్తులు', లక్ష్మికి 'దసరాబుల్లోడు' లాంటి హిట్ చిత్రాలను యిచ్చినట్టే అన్నపూర్ణాకు 'బంగారుబాబు' నిస్తున్నారు, రాజేంద్రప్రసాద్.

## విజేతకు విజయపతాకం

మంచి కథలను అందించే నిర్మాతల్లో దుక్కిపాటి మధుసూదనరావును మొదటి



'వింత దంపతులు'లో అల్లు రామలింగయ్య, నాగభూషణం.

వ్యక్తిగా పేర్గాంచిన దొంగరాముడు దగ్గర్నుండి యిటీవలి అమాయకురాలు వరకు పరిశీలిస్తే, నేను చెప్పింది నిజమని మీరూ అంగీకరిస్తారు.

అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్‌కి బహుళ ప్రచారం పొందిన 'విజేత' నవలను కొన్నారు. అవసరమైన మార్పు చేర్పులు చేశా

## సినిమా

రని మీకు యిదివరకే తెలిపాను.

ఆ మార్పు, చేర్పు లేమిటో అని తెలుసుకుందా మనుకున్నాను మధుసూదనరావుగారిని కథ చెప్పమన్నాను. ఆయన కథను వివరించారు 'కథను విన్నప్పుడే



'ప్రజానాయకుడు'లో జానకి, కృష్ణ

హృదయం ద్రవించింది. బరువైన సన్నివేశాలు ఒకటా, రెండా, చెప్పడానికి ఈ కథ తప్పకుండా ప్రజలకు నచ్చుతుంది. పెద్ద బాక్సాఫీస్ హిట్ అవుతుంది అని ఘంటాపథంగా చెప్పగలను.

## ఎవరికి వారేసాటి

నటించిన వారందరూ ప్రతిభావంతులు గాబట్టి, దర్శకుడు ఆదుర్తి అనుభవజ్ఞుడు గాబట్టి, సాంకేతికవర్గం దిట్టమైనది గాబట్టి, యీ సన్నచిత్రం సర్వలక్షణ సమన్వితంగా రూపొందడంలో ఆశ్చర్య పడాల్సిన అవసరంలేదు.

'మా చిత్రానికి 'అభిమానవంతులు' అని పేరు పెట్టాము' అన్నారు మధుసూదనరావు.

ఈ చిత్రానికి మహదేవన్ సంగీతాన్ని, సెల్వరాజ్ ఛాయాగ్రహణాన్ని, అన్నపూర్ణ సంపిటీని చేపట్టారు. నాయకుడు నాగేశ్వరావు. ముఖ్యపాత్రలను వాణిశ్రీ, అంజలీదేవి, సూర్యకాంతం, రమాప్రభ, లీలారాణి, గుమ్మడి, పద్మనాభం, రాజబాబు, అల్లు రామలింగయ్య, మాస్టర్ ఆదినారాయణ, భానుప్రకాశ్, ఎస్వీరంగారావు (గెస్టు) ధరించారు.

ఈ నెలాఖరులో షూటింగు పూర్తవుతుంది. ఒక స్టేజీ పాటను యీ నెల 29 నుండి ఆగస్టు 2 వరకు సారథీలో చిత్రీకరిస్తారు

## కె. ఎస్. ప్రకాశరావు కొత్త చిత్రం

గత సంవత్సరం కె ఎస్ ప్రకాశరావు దర్శకత్వం నెరపిన చిత్రాలన్నింటికీ ప్రజాదరణ లభించింది. ముఖ్యంగా 'ప్రేమనగర్, తాసిల్దారుగారి అమ్మాయి' చిత్రాల్లో కె ఎస్ పి. ప్రతిభ కొట్టొచ్చినట్లు కనిపించింది.

ప్రస్తుతం శ్రీధర్ ప్రొడక్షన్స్ వారి 'జీవితం' శ్రీకాంత్ ఎంటర్‌ప్రైసెస్‌వారి చిత్రాల దారిలో పడ్డాయి ఇప్పుడు మరొక కొత్తచిత్రం ప్రకాశరావుగారికి వచ్చింది

ఈ సంస్థపేరు సమతచిత్ర. ఛటర్జీ నిర్వహణలో నెలకొల్పబడిన యీ సంస్థ

# సినిమా

పోగించడం? తిండి, నీళ్లు లేక విలా ప్రాణాలతో వుండడం? ఎవ్వరికీ ఏ పాపం తలపెట్టలేని వయస్సు ఆ కుర్రవాడిది విధి అతని జీవితంతో దోబూచులాడింది చివరకి ఆ పసివాడు గతి ఏమైంది? ఇవన్నీ తెలియాలంటే లక్ష్మీ ప్రొడక్షన్స్ వారి రంగుల చిత్రం 'పాపం పసివాడు' చూడాల్సిందే ఈ చిత్రం తెలుగు ప్రజకి వెరైటీగా వుంటుంది. ఖర్చుకు వెనకాడక,



'పాపం పసివాడు'లో ఒక దృశ్యం

భారీ ఎత్తున నిర్మించారు, ఏ. పూర్ణ చంద్రరావు.

## 'సరయిన టైటిల్'

'పాపం పసివాడు' టైటిల్ వింటేనే ఆ కుర్రవాడిమీద సానుభూతి జనిస్తుంది, ఇక చిత్రంలో అతడు పడ్డ పాట్లను చూస్తే, మన హృదయాలు ఎలా వుంటాయో వూహించండి ఈ కథకు గొల్లపూడి వ్రాశారు. సంగీతాన్ని సత్యం ఛాయను కన్నప్ప. నిర్వహించారు లక్ష్మీ ఫిలింస్ విడుదల చేసే యీ చిత్రానికి వి. రామచంద్రరావు దర్శకుడు.

## మాయింటి వెలుగులో

## కృష్ణ ద్విపాత్రాభినయం

శ్రీ మహేశ్వరీ మూవీస్‌వారి 'మాయింటి వెలుగు' చిత్రం (రషస్) చూశాను. చిత్రంలోని దొంగ పాత్రలో నటశేఖర కృష్ణ కనిపించాడు. ముఖ్యంగా డెక్ సెట్టులో కృష్ణ నటన వుద్వేగంగా వుంది. కృష్ణకు పాటిగా, (నాయికగా)

చంద్రకళ తన పాత్రలో జీవించింది. సురలోక నాయిక వేషంలో వెన్నిర ఆడై నిర్మల అందంగా కనిపించింది. కేరళవద్ద గల మూనార్‌లో తీసిన అవుట్‌డోర్ దృశ్యాలు కన్నుల పండువుగా వున్నాయి. ముఖ్య నటులు సత్యనారాయణ, త్యాగరాజు బాగా చేశారు. ఈ చిత్రంలో అంజలీదేవి వుండడం వల్ల కథకు బలం చేకూరింది. చిత్రం ఆద్యంతం దర్శకుడు విజయ్ మేధాశక్తి కనిపించింది. ఈ చిత్రానికి పినిశెట్టి మాటలు; ప్రకాశ్ ఛాయను; సత్యం సంగీతాన్ని సమకూర్చారు. ఇప్పటికి 4 పాటల చిత్రీకరణ జరిగింది. మరో రెండు కావలసి వుంది. ఈ చిత్రం నిర్మాత పైడి మర్రికి డబ్బు తెచ్చిపెడుతుంది.

కృష్ణ నటనలో రామురాను పెర్ఫెక్ట్ కనిపిస్తూ వుంది. ప్రతిపాత్రలో రాణించాలన్న కృషి కనిపిస్తూవుంది. 'మాయింటి వెలుగు'లో కృష్ణ ద్విపాత్రాభినయానికి మంచిపేరు వస్తుంది. పూర్ణా విడుదల.

## మీకు తెలుసా?

హిందీ నటుడు రాజేష్ ఖన్నా, 1974 లో రిటైర్ అవుతారట.

హిందీనటి జయభాదురి, అమితాబ్ బచన్ ప్రాణస్నేహితులట.

మహేశ్వరీ మూవీస్‌వారి 'మాయింటి వెలుగు'లో కృష్ణ దొంగ పాత్రను పోషిస్తున్నారు.

కొత్తగా వెలసిన ఒక సంస్థలో శోభన్ మూడు పాత్రలను పోషించగలరట.

తమిళనటి మంజుల; యితర నాయకులతో యికపై నటించవచ్చుట. ఎం. జి. ఆర్. ఒప్పందం గడువు తీరిపోయిందట.

## ప్రేమ పెళ్ళికి దారితీస్తుందా ?

విధి ఆడించే నాటకంలో మనమెంతా పాత్రధారలం. ఏది; ఎప్పుడు ఎలా జరగాలని రాసిపెట్టి యుంటుందో, అదే ప్రకారం జరిగి తీరుతుంది.

నాటకం చూచి, నాయకుడ్ని అభినందించింది ఒక అందాల లతిక. వారి పరిచయం దినదిన ప్రవర్ధమానమైంది. ఒకరి చూపులు మరొకరిపై ప్రసరించాయి. ఆ చూపులు యిద్దరి హృదయాల్లో గాఢంగా గుచ్చుకున్నాయి. ఇద్దరూ ఒక సుందర ప్రదేశంలో ఏకాంతంగా కలుసుకున్నారు. మనస్సు విప్పి మాటాడాలనుకున్నారు. వారికళ్లు తీవ్రంగా పని చేశాయి. ఒళ్ళు ఆనందంతో నిండిపోయింది. మనస్సులోని మాటలు పాట రూపంలో చెప్పుకున్నారు ప్రేమికులు. ఏమని?

అతడు: తొలిచూపు దూసింది.

ఆమె: హృదయాన్ని.

అ: మరుచూపు వేసింది;

ఆ: బంధాన్ని, ప్రతిమాపు చెరిపింది దూరాన్ని.

ఇద్దరూ: పెళ్లిమాపులే కలపాలి యిద్దరినీ— అంటూ వూహించుకుంటూ

ప్రేయసీ ప్రియులు దగ్గరయ్యారు 'టి కె. కట్' అన్నారు దర్శకులు వి. రామచంద్ర రావు. ఈ శృంగారఘట్టం డి. బి. ఎన్ గారి 'అబ్బాయిగారు—అమ్మాయిగారు'లో కనిపిస్తుంది ప్రియుడుగా కృష్ణ, ప్రేయసిగా వాణిశ్రీ నటించారు శ్రీ ఫిలింస్ విడుదల

## ఈలపాట ప్రవేశం

ఈలపాటతో మంత్రముగ్ధుల్నిగావించే

# సినిమా

శక్తిని బడసిన ఈలపాట రఘు రామయ్యకు సినిమాల్లో నటించే అవకాశం వెతుక్కుంటూ వచ్చింది,

నిజజీవితంలో సదా, సర్వదా రామనామాన్ని స్మరించే రఘురామయ్యకు రామ భక్త హనుమాన్ వేషం లభ్యమైంది.

శ్రీ కోదండరామా ప్రొడక్షన్స్



నటి వాణిశ్రీ

(చిత్రకారుడు కొండూరు వాగీశ్వరరావు)

'శ్రీరామాంజనేయ శపథం' చిత్రాన్ని నిర్మిస్తున్నారు గబ్బిట వెంకట్రావు రచయిత కదారు నాగభూషణం దర్శకుడు. సి రామమోహన్ నిర్మించే ఈ చిత్రంలో రామకృష్ణ రాముడు —శ్రీనివాస్

# కలెక్షన్ లేని చిత్రాలు.

# ఏ. యల్. శ్రీనివాసన్

# ఫిలించాంబరు కొత్తఅధ్యక్షుడు-

# శ్రీ నాగిరెడ్డి

# తెలుగులో వహీదారెహమాన్



పడిపోతున్న తమిళ చిత్ర పరిశ్రమను పరిరక్షించ వలసిందిగా శ్రీ ఏ ఎల్ శ్రీనివాసన్ ఋటీవల తమిళనాడు ప్రభుత్వానికి ఒక విజ్ఞాపన పత్రాన్ని అందజేశారు

"ఈ సంవత్సరం మొదటి ఆరుమాసాల్లోనూ విడుదలయిన చిత్రాల బాక్సాఫీసు కలెక్షన్సు గత సంవత్సరం కన్నా చాలా అధ్వాన్నంగా ఉన్నాయి మూడు నాలుగు చిత్రాలు మాత్రమే ఈ ఆరు మాసాల్లోనూ బాగా ఆడినాయి. మిగిలిన చిత్రాలన్నీ నిర్మాతలను కంటతడిపెట్టించాయి. పంపిణీదారుల్ని ఆర్థిక నష్టంలో ముంచెత్తాయి లాభాలను ఆర్జించింది థియేటరు యజమానులు మాత్రమే!" అని పేర్కొన్నారు శ్రీ ఏ యల్ శ్రీనివాసన్ తన పత్రంలో

"మద్రాసు నగరంలో థియేటరుఅద్దెలు ఆకాశాన్నంటుతున్నాయి ఒక థియేటరుకు వారానికి సుమారు రూ 6,000 నుంచి 15,000 వరకూ అద్దె పుచ్చుకుంటున్నారు మవుంట్ రోడ్ ప్రాంతంలోని ఒక థియేటర్‌లో ఒక చిత్రం నదివారాల్లో మూడు లక్షల రూపాయలు వసూలు చేస్తే—దానిలో లక్ష నలభై వేల రూపాయలు వినోదపు పన్ను నవర్ ఛార్జీ క్రింద పోతోంది లక్షా యాభై వేలు థియేటర్ అద్దె కింద మిగిలిన పది వేలు అడ్వ థియేటర్ ఖర్చులు, పోలీస్ బందోబస్తు, పబ్లిసిటీలకు పోతోంది అని కూడా ఆయన ఆ స్టేట్‌మెంట్‌లో ఉదహరించారు

ఒక మరి అలాంటప్పుడు నగరంలో చిత్రం విడుదల చెయటం వల్ల నిర్మాతకు ఒరిగేదేమిటి? అతనికి మిగిలేదేమిటి?

* * *

విజయా అధినేత శ్రీ బి నాగిరెడ్డి— దక్షిణ భారత చలన చిత్ర వాణిజ్య మండలి అధ్యక్షుడుగా 1972—73 సంవత్సరానికి ఎన్నుకోబడారు ఉపాధ్యక్షులుగా శ్రీయుతులు సుందరలాల్ నహాతా రంగస్వామి ఎన్నిక అయ్యారు శ్రీయుతులు డి వి ఎస్ రాజు, కె ఎన్ రామానుజం గౌరవ కార్యదర్శులుగ వ్యవహరిస్తారు

* * *

రోజులు మారాయి, కన్యాదానం చిత్రాలలో నృత్యం చేసి జయసింహ చిత్రంలో ప్రముఖ పాత్ర ధరించి హిందీ చిత్ర రంగానికి వెళ్లి అగ్రశ్రేణి తారగా గణుతి కెక్కిన పద్మశ్రీ వహీదా రెహమాన్— ఇంతకాలానికి మళ్లీ యిప్పుడు తెలుగు చిత్రంలో నటించబోతున్నది

బాబూ మూవీస్ కంబైన్స్ పేరిట ప్రముఖ దర్శక నిర్మాత శ్రీ ఆదుర్తి సుబ్బారావు నిర్మించే చిత్రంలో హీరో కృష్ణ ప్రక్కనే కథానాయికగా వహీదా నటిస్తున్నది ఈ చిత్రంలో మరో నాయిక పాత్రకూడా ఉన్నది. ఆ పాత్రకు తమిళ చిత్రాలలో ఎం జి ఆర్ ప్రక్కన నాయికగా నటించి రాణించిన మంజుల బహుశా నియమించ బడవచ్చునని అనుకుంటున్నారు

—మోహన్ కుమార్

# భూపరిమితి చట్టం ...

(3వ పేజీ తరువాయి)

(3) ప్రభుత్వ ఆఫీసులలో తీసుకునే అంచాలు, మామూళ్ళ పైన పరిమితి కావాలి

(4) ఆకాశాన్నంటే ధరలమీద పరిమితి ఏర్పడాలి ఈ పరిమితులు విధించినట్లయితే, చాలా మందికి, ముఖ్యంగా బీద వారికి మేలు జరుగుతుంది

ఏనుగులు పోయేదారిని వదిలివేసి, చీమలు పోయేదారిని మూసినట్లు, అభివృద్ధికి దోహదం చేసే పై పరిమితులను వదిలివేసి రైతులమీద, వారి ఆదాయం మీద పాక్షిక దృష్టితో పరిమితి విధించటం న్యాయం కాదు అందరికీ న్యాయం సమానత్వం తెచ్చే విధంగ పరిమితులను విధించాలి గాని, కొందరికి అపరిమిత అన్యాయమూ, మరికొందరికి కొండంత మేలూ చేసే విధంగా విధించరాదు రాజకీయ దృష్టితో గాక, మానవతాదృష్టితో, న్యాయదృష్టితో ఆలోచించి ఏ పరిమితైనా విధించాలి

Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press 6 & 7 Thambu Chetty Street, Madras-1 and at Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.
Editor : S. Radhakrishna.


పల్లెటూరిపిల్ల
బస్తీదొరసాని


అనాగరికుడు – నాగరికుడు


నాడు
నేడు


మీసాలు తరుగుట పెరుగుట కొరకే!

